





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# రాధాకృష్ణ లీల





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015974

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శ్రీ

# రాధాకృష్ణలీల

అను

# చంద్రముఖీగర్వభంగము.



## ప్రథమాంకము.

---

### ప్రథమరంగము.

స్థలము :— రేపల్లెవాడలోని యొకవీధి.

[నారదుండు ప్రవేశించుచున్నాడు.]

నార— 1 వ అనుబంధము.

ఆహా! కాల మెంతవ్యత్యాసమై కనుపడుచున్నది.

మ. కని లోకంబులు మోసపోవునటు మా । ఘస్నానముల్ జేసి సం
ధ్యను మాహ్మాలల దొమ్మరింప్ల కెలమిన్ । దారాంబునన్ సామ్యమున్
జనులాడన్ వినియుంటిగాని యదియే । సత్యంబుగా ద్వాపరం
బుననే కన్పడె నింక నాకలియుగం । బున్ జూడ నెట్లుండునో?

ఎట్లుండునో యని సంశయింపవలసిన యగత్యమేమియు లేదు.

సీ. మనుజుల భ్రమపెట్టి । ధనలాభమును బొంద
కపటసన్యాసులై । గ్రాలువారు,

మాతాపితురుభక్తి / లేసంబున లేక
పైపయినటన గ / న్పఱచువారు,
ఉదరపూజను గోరి / యెదలేని హరిభక్తి
గలయట్లు జరియింపఁ / దలఁచువారు,
మగల మోసముజేయ / మహిత పాతివ్రత్య
మహిమాన్వితల యట్లు / మసలువారు
తలఁపఁగా "ధనమూలమి / దం జగత్తు"
టంచు నెంచి మోసమున న / ర్తించువారు
లీయుగంబుననే యిట్టు / లెనయుచుండఁ
గలియుగము కోటిగుణితంబు / కాకపోనె!

సందియము లేదు. కోటిగుణితం బన్నమాటయేమి? శతసహస్ర కోటిగుణితంబుగా వచ్చుననుటకు సందియము లేదు..... ... ఔరా! చంద్రముఖి కెంతగర్వము. వెనుకటి మహాపతివ్రత లెవ్వరును దన కాలిగోటి కెనగారని గర్వించుచున్నది. వారి యం దేమేమియో లోపంబు లెత్తి చూపుచు, తనయం దట్టి లోపంబులేమియు లేవని నిరూపించుచు నెవ్వ రెక్కుడువారో జెప్పుమని తన చెలినడిగి నప్పు డామె నిజమెఱింగింప నిష్ట ముండియు నట్లెఱింగించినచో దనబ్రదుకు జెడిపోవునను భయంబు పెంపున విధిలేక "అమ్మా! మీకాపతివ్రతలు సాటి రారని జెప్పినది." ఆమాటలతో నిక్కముగా దానే మహాపతి వ్రతనియు, తనవలననే జగముద్ధరింపఁ బడుచున్నదనియు దలంచి మహామహులనేని లెక్కగొనకుండ నున్నది. ఔరా! ఇట్టి పనికిమాలినవారింక నెందఱున్నారో గదా?

సీ. పనికిమాలినపాట్ల / కునుదాసులై నీచ
పనులెన్నొ జేయ బా / ల్పడెడివారు,

నిజమాడ మెడబట్టి । యజమాని గెంటునన్
భయమున ననృతము । బలుకువారు,
కాసులు రెండుండఁ । గంట్లమూసుకపోయి
క్రిందు మీఁదెఱుఁగక । ప్రేలువారు,
తనదోష మొరులపై । ననువుగాఁ బడద్రోసి
తామహాత్ములమంచు । దలఁచువార,
లాత్మ సంస్తుతి పరనింద । లందు మునిఁగి
యననిఁ దమయంతవారు లే । రని తలంచి
యన్నిటను మాయ లెన్నెన్నొ । బన్నువారు
వాయు వట్టుల జగమెల్ల । వరలుచుండె.

మహాపతివ్రతామణినని విఱ్ఱవీగి యందఱను నిందించుచున్న నీచంద్రిముఖి కొక్కమారు శృంగభంగం బొనరించి యేదాసిచే నిప్పుడిది మెప్పించుకొనుచున్నదో కట్టకడపట కాదాసిచేతనే నిదినిందింపఁ బడునట్లొనర్చి జగమెల్ల మేలమాడునట్లొనర్పవలయును. కావున నేనరిగి శ్రీకృష్ణభగవానునకీయుదంతం బెఱింగించి యాపైన నీమె గర్వపరిహారమగునట్లేదేని యొకయుక్తి బన్నించి యీమె నధఃపాతాళములలోని కణచి తీరెదఁగాక.

2. వ అనుబంధము.

(నిష్క్రమించును.)



## ద్వితీయ రంగము.

స్థలము:—చంద్రముఖ గృహాంతర్భాగము.

[చంద్రముఖియు, మాలినియుఁ గూర్చుండియుండఁగా దెర లేచును.]

మాలి—దేవదేవు డెందులకమ్మా! ఇంతరాత్రిమున కాతఁడుగూడ రావలయునా? మన నందయ్య కుమారుఁ డెట్టి పతివ్రతా మణినైనను నిముషములో లొంగదీసి తనదానినిగా నొనర్చు కొనును. బృందవృత్తాంత మీవెఱుంగవు గనుకనా?

చంద్ర—మాలినీ! బృంద సంగతి నాచెంతఁ జెప్పకుము. మాయ వేషమును గాంచి మగడనుకొని పరపురుషాలింగనం బొన ర్చుకొనిన బృందగూడ మహాపతివ్రతయే యనుకొనుచుం టివా? ఎంద ఱెన్నిమాయ వేషములు వేసికొనవచ్చి యెన్న న్నను నిజముగు తనభర్త యెవ్వఁడో గనిపెట్టఁజాలని దాఁడు దియేగా దనవలసి నప్పుడు మహాపతివ్రతయని యనుటకు నోరాడునా?

కం. చాయగతి తనదుచిత్తము
పాయక తనభర్తయందుఁ బఱగిన యోషిన్
న్యాయముదప్పిన పురుషుల
మాయారూపంబుగాంచి మరులం బడునే?

నిక్కముగు సాధ్వియైన దానిని దేటిబాటి చూచుట కానందయ్య కుమారునకుఁ గాదుగదా ముక్కంటికైననుఁ దరముగాదు.

మాలి—అమ్మా! అట్లనకుము. మననందయ్య కుమారుండన సామాన్యుండు గాఁడు. అతఁడురాధికాస్వాంతుఁడు. గోపికావ ల్లభుఁడు. గోపికాంగన లెంద ఱాతనికిఁ బ్రియురాండ్రై యు న్నారో జూడుము. తమతమ భర్తల యనుజ్ఞలం బడయకయే శ్రీకృష్ణపాదారవింద సేవ జేసి తరింపవలయునని నిత్య మెంద

ఈ వనితారత్నము లామహామహునిచెంత కరుగుచుండుట లేదు. నీవు చూచుచుండుట లేదు.

చంద్రి—వారందరునుజారాంగనలే యనవలయును. నిజనాథునికంటె దైవము కాంతకులేదని వేదములుఘోషించుచుండ, నిజనాథుని మోమైనఁజూడక, నిజనాథునియాజ్ఞయైనబడయక, పరపురుష సందర్శనోత్సాహంబున బరుగులెత్తువారు జారాంగనలుగారా? అట్టివారికి స్వర్గ మాకాశకుసుమముగాదా? వారికే కాక వారిముఖావలోకనమొనర్చిన వారికిగూడ నరకము కరతలామల కమైయుండును. కృష్ణుఁడైనను దన్ను గౌరవించు జారస్త్రీల యిండ్లకే వెడలునుగాని నావంటి సతీరత్నముల యిండ్లకెన్న డును రాడు. ఇంగతి సందర్భంబు లెఱుంగక వచ్చినను బృంద చెంత సాగినట్లు నాచెంత సాగదు.

[చాటుగా శ్రీకృష్ణనారదులు బ్రవేశింతురు.]

కృష్ణు—(అపవారించి) నారదా! ఇప్పుడు మాట్లాడినదే చంద్రిముఖి యైయుండును. దీని కామాలిని యేమిసమాధానం బిచ్చునో వినదము.

మాలి—అమ్మా! ఈపురంబున మీరొక్కరిట్లనుచున్నారు. మిగిలిన తరుణీమణులంద తేమనుకొనుచున్నారో మీరెప్పుడైన విని యున్నారా? ఆశ్రీమన్నారాయణుని యవతారములలో నీకృ ష్ణావతారమొకటియనియు, యీమహామహుని పాదసేవయొ నర్చి యీతనిఁ బొందగలిగినచో దమకింక జన్మలేదనియు వైకుంఠము గరతలామలకమై యుండుననియు దలంచుచున్నా రు. ఆదివ్యమంగళవిగ్రహము నొక్కసారి కన్నులార జూచి నచో నెట్టి ఱాయివంటిహృదయముగల స్త్రీయైనను నగ్నిపైఁ బడ్డవెన్నచందంబున నగునందును. నీవాతని నెన్నఁడును జూడ

లేదనుకొందును. ఆకురులయందము — ఆముక్కు—కన్నుతీరు—ఆముఖకాంతి— ఆకనుబొమ్మలపొందిక— కమలములవంటి యాకనులయందము— ఆకస్తూరితిలకము— ఆపెదవులసొగసు— ఆవిపుల వక్షస్థలపొందిక— ఆబాహువులనిడుపు— ఆహార్యతుని భమధ్యము— ఆపదములసొంపు— ఆహాహా! ఆమహామహుని వర్ణింపనాతరమా? వేయేల? ఒక్క—మారాదివ్యసుందరమన్మథ విగ్రహమును దనివారగాంచిన నెట్టి పతివ్రతామణియైనను తనసతీత్వమునకుఁ దిలోదకము లర్పించి యాతవి బాహువల్లరులఁ జిక్కు—కొనకుండునా?

చంద్ర—మాలినీ! నిన్నుబోలు చిత్తభ్రాంతిగలవారి కాతఁడట్టియందగాఁడై గాన్పించునేమోగాని నావంటియుత్తమరాలికంటి కాతఁ డధమాధముని బోలె గన్పడును.

మాలి—నీవాతనినొక్క—మారుగాంచి యట్లనినచో నేనంగీకరింతును. నీవెన్నియన్నను సరియెగాని— నీవంటి విద్యావతికి— నీవంటి మించుబోడికి—నీవంటియందకత్తియకు—ఆశ్రీకృష్ణుఁడే పతియైనచో నెంతయోబాగుండెడిది.

చంద్ర—ఛీఛీ! జారచోర శిఖామణియని జగత్ప్రశిద్ధిగన్న యానీచుని నామము నాకు వినిపింపకుము.

మాల—అమ్మా! క్షమింపుము.

చంద్ర—మాలతీ! చక్క—నివాఁడైనచో భర్తగానంగీకరింపవలయునని యు, లేనియెడల లేదనియు దలంపకుము. మనతలిదండ్రులెవ్వనిని దెచ్చి మనకు గూర్తురో యాతఁడు—

* కం. ధని యధనుఁడు రూపసి యొ
ప్పనివాఁడు, వివేకి, మూఢ ! భావుఁ డరోగుం

డనుగతరోగుఁ డనక యం
గన పతిఁ బాటింపవలయు । గామధ్వంసీ.
అనిధర్మ శాస్త్రములు బలుకుచున్నవి. నావంటిపతివ్రతలంద ఱాధర్మ
శాస్త్రమునకు గట్టుబడి యుండవలయును.
కృష్ణు — (అపవారించి) నారదా! ఈమెశోత్రకర్ష వినజాలకున్నాను.
నీవుచెప్పినదంతయు సత్యమై గన్పట్టుచున్నది. నీవనిన ట్లీమెకు
శృంగభంగ మొక్కమారొనరింప వలసినదే.
నార — దేవదేవా! అహంభావత్వమడపకున్న పట్టపగ్గము లుండునా?
మాలి—(తనలో) అబ్బా! ఈమె తనకు దానెంతగాబొగడు కొనుచు
న్నది. (పైకి) అమ్మా! ఇప్పట్టుననీవు దక్క నాకింకెవ్వరును
పతివ్రతామణులు గన్పట్టుటలేదు. ముందెవ్వరైన జన్మింతు రే
మో చెప్పఁజాలను.
చంద్ర—మాలినీ! నానిశ్చితాభిప్రాయమెఱింగించెదను వినుము.
సీ. బ్రహ్మాభవాదుల । బాలురగాఁజేసి
శుభములందిన యన । సూయకంటె
చిచ్చునంజొరబడి । చెక్కుచెదరకుండ
చిచ్చువెల్వడియున్న । సీతకంటె
యొంటిమై పైఁబడ । నుంకించు యెరుకను
నట్టెమాడ్చిన దమ । యంతికంటె
యముని వెంటనె బోయి । యతనిమెప్పును బొంది
విభునిబడసిన సా । వితిత్రికంటె
సూర్యునకు శాపమిచ్చిన । సుమతికంటె
రహిగలట్టి తక్కినపతి । వ్రతలకంటె
చంద్రముఖయే పతివ్రత । జగతిననుచు
లోకులనుకొను నటులుండ । లోఁదలంతు.

నాకట్టి ముఖ్యోద్దేశముగల్గుట కేమికారణమో నీవెఱుంగకున్న నన్నెగ తాళి జేయసమకట్టెదవు? అనసూయ విగతవస్త్రయైనది. సీత రామునిచే విసర్జింపఁబడినది. దమయంతి దాస్యమొనరించినది. సావిత్రి పరపురుషుని వెన్నాడినది. సుమతి తనభర్తకొకముం డను దెచ్చినది. ఒక్కొక్కచెంత నెన్నుటకైన లోపములున్నవి. అట్టిలోప మావంతయు లేకుండ నేనీతనువు వెళ్లబుచ్చితినేని మహాపతివ్రతలకందరకును శిరోమానికము నగుదును. ఇది నాయాశయము. ఇందు నేను కృతార్థరాలనైతినేని నాజన్మ తరించినట్లెంచవచ్చును. పతివ్రతాలక్షణము లేమియు లేకున్న నాకట్టియాశ జనించుట కవకాశము లేదుగాని యిప్పుడట్టి య వకాశముబూర్ణముగా లభియింప నేలవిసర్జించుకొనవలయును. నేను మహాపతివ్రతనను విఖ్యాతి నార్జించితినయేని యామె దాసియు ప్రతిభావంతురాలే యని లోకు లనుకొనక మాన రు. నామరూపములు లేకుండ బోవలసిన నీవుగూడ నామూ లమున జిరస్మరణీయ వయ్యెదవు? అంతకంటె నీకింకేమిగావ లయును. దమయంతి పైబడబోయిన యెరుక దుర్మార్గుడైనను వాఁడు చిరస్మరణీయుఁడయ్యెను. అట్టిది సన్మార్గురాల వగు నీవు చిరస్మరణీయవు కాకపోవుదువా?

కం. మనచారిత్రమె కథగా
గొని విరచించుచునుందురి । గొప్పకవీంద్రుల్
ఘనతరకార్యము లెన్నియొ
వనితా! మనకంతకంటె । వలసినదేదే.

**మాలి**—అమ్మా! నీవనినట్లు జరిగినచో మనకంతకంటె వలసినదింకే మున్నది? చతుర్దశభువనంబులయందును పేరెన్నికగన్న సత్సతీ మణియను విఖ్యాతి నీకును, ఆమహాపతివ్రతచే నాదరింపఁబడి

నదను కీర్తినాకును వచ్చినచో నంతకంటెగావలసిన దేమియు లేదుగాని యట్టివిఖ్యాతి గణించుకొంటయే దుష్కరమని భావించుచున్నాను. అందున నహంభావముగలవారి కది గగనకుసుమమేయనవచ్చును.

చంద్రి—అనఁగా నే నహంభావముగలదాన ననియటే నీ యభిప్రాయము.

మాలి—కాదమ్మా! అత్యాచారసంపన్నుఁడెత్తి యెత్తి యొగిలాకుపై ననే యశుగునైచునట్లు-శాస్త్రయుక్తముగా మాట్లాడదలచిన వాఁడే యూదియూది యపశబ్దాబులాడునట్లు- తప్పువ్రాయుదునేమో యని పట్టుఁబట్టి వ్రాయువాఁడే తప్పువ్రాయునట్లు-నిరోగిగానుండవలయునని నిరంతరమును మందులుమ్రింగువాఁడే నిరంతరరోగపీడితుఁడైనట్లు-నీపట్టుదల తారుమారై నీకు శృంగభంగమొనఁగూర్చునేమోయని నాకు భయమగుచన్నది.

కృష్ణు—(అపవారించి) నారదా! మాలిని మిగుల ధైర్యముగా మాట్లాచున్నదే.

చంద్రి—మాలినీ! నీకు మతిభ్రమణమొదవుచున్నది. ఏదేనొక కార్యమొనర్పవలయునని లక్ష్యముంచి పనిజేయువాని కా లక్ష్యము గుదురునట్లు—నాకార్యదీక్ష నాకు సహకారియై తీరును. నాకందు జయము లభించితీరును.

సీ. దేవదేవునిగాంచు । దీక్షమై కానల
జేరిధ్రువుఁడు కార్య । సిద్ధిగాంచె,
సావిత్రి మగనికై । జమునితో సాధించి
సాధించి వెంటాడి । జయము గాంచె

సత్యహరిశ్చంద్రి । సార్వభౌముఁడు తన
వ్రతమందు సుస్థిర । ఫలముగాంచె
దమయంతి యెఱుకను । దగ్ధంబుగావించి
తనసతీత్వమునిల్పి । ఘనతగాంచె
వీరలెల్లరు నావంటి । వారెగారె
జయముబొందంగ యత్నముల్ । సలుపలేదె
యత్నములొనర్చి యపజయ । మందినారె ?
పట్టుదలయున్న కార్యలా । భంబులేదె ?

మాలినీ ! ఏకార్యమున కైనను మనము వెఱవరాదు. అట్లు వెఱచుట ధీరలక్షణముగాదు.

తే. గీ. తలపడేపని కాదని ? తలచి జడుఁడు
తలఁచి వెంటనే విడచును । ధ్యముఁడు వెఱచి
తలఁచి నటుజేసి ఫలమును । త్తముఁడు బొందు
స్వప్రియత్నము విడరు ప్రి । జ్ఞాధికు లిల.

కాఁబట్టి నాయెడ నీవు సంశయింపకుము. అన్నట్లు నెచ్చెలీ ! నేను నాపుట్టింటికి వెడలవలయుననుకొంటిని గదా ? నీవు వెడలి మనసోమశర్మను దోడ్కొనిరమ్ము.

కృష్ణ—(అపవారించి) నారదా ! మనము వెడలి యీమె ప్రియాణ మాపవలయును. ఆ వెనుక నీమె మనోధైర్య మెట్టిదో పరిశోధింతము. రమ్ము. (ఇరువురు వెడలుదురు.)

[అప్పు డతఁడు యపాత్రితో, పంచాంగముతో సోమశర్మ
ప్రవేశించుచున్నాడు.]

సోమ—సీతారామాభ్యాన్నమః-ఈ-ఈ-వె-వె-వే-శ...దదదదశమీ సోవా-వా-వారం. రే-రే-రే-వతీ నక్షత్రం ప-ప-పప-గలు పన్నెండు ఘడియలకు వ-వ-వ-ర్జం.

చంద్రి—(లేచి) బ్రాహ్మణోత్తమా ! నమస్కారము.

సోమ—ధి-ధి-దీర్ఘాయురస్తు. శశశతకోటి-పిపిపిల్లలుగలిగి-అ-అ-అ-అనంతకోటి--ఆదాయముగల్గి-వ-వ-వ-వర్ధిల్లుము.

మాలి—(నవ్వును)

సోమ—(కోపముతో) నినినీననవ్వాకుకుకూలిపోను. దదదాసీ ముండవు. ననన న్నెక్కిరిస్తావ వ-వ-వ-షె-మిడిమే-మే-మే-లపుము-ముం-డ.

మాలి—స్వామీ ! మీనత్తికి నేను నవ్వలేదు.

చంద్రి—స్వామీ ! దానిమాట కేమిగాని, మాపుట్టినింటికి వెడలవలయునని యున్నది. ముహూర్తముంచి చెప్పుడు.

సోమ—(పంచాంగమును జూచుచు) యి-యి యీసంవత్సరము ముముమాఘమి ముముమ్మాఘపునెలలు. అ-ఆఅ-సతల ఆషాఢం ఇ-ఇ-ఇల్లుకదలకూడదు. శశశ శ్రావణ భాద్రపదములు వవ వర్షాకాలము. అఅఆశ్వీయుజము ఆఅఅనుకూలము క క కాదు క-క-కార్తికము కకకకదలరాదు. మార్గశీర్షముచుచుచుక్కెదురు. పుపుపుష్యము చుచుచు క్కెదురు. సూ-సూ సూన్యం. మమమాఘములో మమమాఘ-పుపుపుబ్బ. వువువు త్తర-కుకు-కూడదు. ఫఫఫ ఫాల్గునంలో (చూచుచు) బాబా బాగుంది సససప్తమి...ఆఆఆదివారం భభభరణీ నక్షత్రం-నినినీ ప్రయాణం-బా-బా-బాగుంది.

చంద్రి—చాల తక్కువ కాలము ముమూర్తముంచితిరి. (అనిబహుమానమిచ్చును.)

సోమ—(వెడలును.)

చంద్రి—మాలినీ ! ప్రయాణము సాగినది కాదు. నీవొకమారు నీ పుట్టింటికి వెడలవలయు. ఉత్తరము వ్రాసి యిచ్చెదరమ్ము.

(ఇర్వురును నిష్క్రమింతురు)

## తృతీయ రంగము.

—(స్థలము—రాధగృహము)—

[రాధ కూర్చొనియుండఁగాఁ దెర లేచును.]

రాధ.—(తనలో) ఓ శ్రీకృష్ణా ! నీదివ్యదర్శనభాగ్య మెన్నఁడు లభించును ?____ఆహా !

*ఉ. చక్కనివారి నెల్ల నెక । సక్కెము లాడెడు చక్కనయ్య యై
చొక్కుచుఁ దానమానలయ । శోభితగానరసామృతంబు న
ల్దిక్కులఁబిక్కటిల్ల మురళింబలికించెడి బాలు నెన్నఁడో
గ్రక్కునఁగాంచి యెత్తికొని । కన్నుల నొత్తుదు దత్పదాబ్జముల్.

స్వామీ ! నిమురమేల్కాంచినది మొదలు నిమురించువఱకును గూడ నీపాదసేవ యొనర్చుకొనుటకుఁ దగినయవకాశమే చిక్కకున్నది. హృదయప్రియా ! నీవు నాయందనుగ్రహించి యొకమాఱైన రాగూడదా ? నేనేమి ద్రోహము జేసితిని. (ఒక్కనిముషమూఁగి) అయ్యో ! నేనెంత వెఱ్ఱిదానను. గోపాంగనామృదుమధురభాషణములు వినఁగోరి నిదిరించువానికై వడి నటించుచు, మధ్యమధ్య చిఱునవ్వుబఱపుచు, వారియందు గలిగిన ప్రేమాతిశయమునఁ గలిగినగగుర్పాటచే నొడలు నిండిన దేవకీనందనునకు నాబోటి దీనురాలియందు ప్రేమ జనించునా ?

### 3 వ అనుబంధము.

బాలకృష్ణా ! నీవెంత మరుగు జేయుచున్నను నీచేష్టలన్నియు నాకన్నుల యెదుట స్పష్టముగ గాన్పించుచున్నవి. నీయనిర్వాచ్యములగు శృంగార చేష్ట లందముగా నాహృదయమునం దాండవ మాడుచున్నవి. స్వామీ ! తేనెలొలుకు చిరునగవుతో-కలకలలాడు నెమ్మొగముతో-నన్నెప్పుడు జూడవచ్చెదవో యని నీరాక కెదురు

జూచుచుంటిని. కృష్ణా ! ఒక్కముహూర్త కాలము నాతో ముచ్చ
టించి నీవాగమృత మించుకీయ భాగ్యురాలిని గోలసీయవా ? నీ
దయారసమగు జూడ్కులు నాపైఁ బ్రసరింపనీయవా ? నీప్రేమ నా
పై లేనిచో బ్రదుకఁజాల. రుక్మిణీ సత్యభామాదులపైఁగల కూర్మి
నాపైఁగూడ కొంత నుంచుము. సకల ధర్మాధర్మస్వరూపుండవగు
నీకు బక్షపాతబుద్ధి యుండఁగూడదు. నాకు నీయెడలనుండుకున్న ప్రే
మంబెట్టిదో నీవెఱుంగవా స్వామీ ! సకల ధర్మశాస్త్రవిశారదుం
డవగు నీవు నీప్రియురాండ్ర నందఱ నేకభావంబునఁ జూడవలదా ?
దేవా ! ఈనీచరణదాసియం దాదరభావముంచి నన్నుఁగరుణింపవా ?

*ఉ. వేమఱుఁ గేలుమోడ్చి నిను ‖ వేఁడెద నే నెలుగెత్తి యిత్తెఱన్
నా మొఱలాలకింపు కరు ‖ ణానిధి ! దీనశరణ్య ! సంతతో
ద్దామభవత్కృపారససు ‖ ధామధురాబ్ధి తరంగపాళిలో
నేమికొఱంత నాపయి నొ ‖ కించుక నుంచిన నందనందనా !

నాపై మీరలేని ప్రేమాతిశయము నీకుఁగలదని లోకులెల్ల రనుచుం
డ విని యెంతయో సంతసించితిని. తేపు నీయింటికి తప్పకవచ్చెదనని
నిన్నటిదినమున నీవెంతయో బాసజేసితివే. ప్రామాణిక మొనర్చి
తివే. ఇదివఱ కేలరావైతివి ? నాపై నీకు నిజముగా దయగలదా ?
ఉన్నచో నన్నిట్లు దుఃఖాంబుధిఁ బడదోతువా ? ఇట్టిమోసగాఁడవ
గు-ఇట్టిమాయకాఁడవగు నిన్ను నమ్మవచ్చునా ? రాధాకృష్ణుఁడని
లోకులను వాక్యము మృషావాక్యమట్లొనరించితివే. నాయెడ నీవింత
టినిర్దయ వహించిన నేను మనియుండఁగలనా ? ఒక్కనిముషము నీ
ముఖారవిందము నాకు దూరమైనచో నాకీ విపులప్రపంచమంతయు
నంధకారబంధురముపోలె గాన్పించును. నిన్నెడబాయనినాఁడు-నీదండ
వసించిననాఁడు- నీకైదండప్రాప్తి నాకు లభించిననాఁడు- శరత్కా
లపూర్ణిమనాఁటి వెన్నెలలో విహరించినట్లు నామనము బ్రహ్మానం

దమైయుండును. నాసఖీజనముతో నీకథలే చెప్పుచుందును. ఎల్లవేళల నీనామసంకీర్తనమే చేయుచుందునే. నిదురించునప్పుడుగూడ నీ మనోహరాకారమునే నాహృదయఫలకమునఁ జిత్రించుకొని-యామహనీయరూపమునే నామనోనేత్రముతో జూచి యానందించుచుంటినే.

4 వ అనుబంధము.

అయ్యో ! నేనెంత నిర్భాగ్యురాలను. ఎంతమందమతిని. ఎంతదురదృష్టవంతురాలను. నాకా మహనీయసందర్శనానందభాగ్య మెల్లొదవును ? శ్రీకృష్ణుని దోడితెమ్మని యుదయముననే బంపినగోపికతిరిగి యింతవఱకేల రాలేదు చెపుమా ? ఆమహామహుని దర్శనభాగ్యమానిర్భాగ్యురాలికైనదో లేదో ? ఆదివ్యతేజుని దర్శించుట కిల్లిల్లు దిరుగుచున్నది కాబోలు ? ఓశ్రీకృష్ణా ! నాయెడల నీకీ నిర్దాక్షిణ్య మేల ?

తే. గీ. పదియునార్వేల గోపికల్ । పడవలగతి
పిృయసతీమణు లోడలై । విచ్చలవిడి
నీదుమోహాబ్ధిలోఁబడి । నిండుముదము
బడయుచుండంగ నాకట్టి । ప్రాప్తిలేదె ?

[అప్పుడు గోపిక ప్రవేశించుచున్నది]

గోపి—(తనలో) ఔరా ! శ్రీకృష్ణు డెంతమోసగాడు. రాధమనోవేదనఁ జూడఁజాలక యామహానుభావునిదోడితెచ్చెదమని పోయితినే గాని యాతఁడు నావంటిదానికి జిక్కునా ? కానిమ్ము. నా కాతఁడు దొరకలేదని యామెకుఁ జెప్పివేసెదను (అని సమీపించును.)

రాధ—(గోపికనుగాంచి చటాలున లేచి)

శా. ఏడే యానవనీతచోరుఁ డగు (శ్రీ) । కృష్ణుండు? నావార్త వి
న్నాఁడే? మోదముతోడ వత్తునని య । న్నాఁడే? మఱేమైన న
న్నాఁడే? భార్యలు వెళ్లవద్దనుచు న । న్నారే? దయారాశి నీ
తోడన్ రాడయె నేమి కారణమొ? నా । తో జెప్పవేమే సఖీ!

గోపి—అంత తత్తఱమేలనమ్మా! ఒకనాటికి గాకున్న నింకొక నాటికైన నీసముఖమున కాతఁడు రాకుండఁ బోవునా?

రాధ—అట్లయిన నీనా డాతని దర్శనభాగ్యము నాకొదవదా?

గోపి—ఒదవునో యొదవదో నేనెట్లు చెప్పఁగలను?

రాధ—ఆతఁడేమనెను?

గోపి—అమ్మా! ఏమని విన్నవింతును. ఆనీరజపత్రనేత్రుఁడు సత్యభామ గృహంబున నున్నాఁ డని విని యచ్చటకుఁ బోయి యాతనిని గాంచితిని.

రాధ—తరువాత?

గోపి—తరువాత నీసందేశ మాతనికి వినిపింప వలయునని "దేవా" అని పిల్చితిని. ఇంతలోనే నామహానీయుఁడు మఱుమాయ మైపోయెను. ఇల్లంతయును వెదకితిని. వృథాయాసమే యయ్యెనుగాని లాభకారి కాలేదు.

రాధ—అట్లయిన సత్య నడుగక పోయితివా?

గోపి—అడిగితిని.

రాధ—ఏమన్నది?

గోపి—"నీకనుల కేరైన గంతలుగట్టిరా? ఇచ్చున్నచో గాన్పింపరా" అని యన్నది.

రాధ—దుర్మార్గురాలగు సత్యయే నీకండ్లలో గారముజల్లి కృష్ణుని మాయ మొనర్చినది.

గోపి—ఆమెచేసిన దేమున్నది? ఆస్వామియే మాయమయ్యెను.

రాధ— ఇది సత్య యభిప్రాయమా ?

గోపి—కాదు నాయభిప్రాయమే.

రాధ — నీవు తెలివితక్కువదానవు. ఆమె కుటిలాలోచన మెఱుంగుటకుఁ దగిన శక్తియుక్తులు గలదానవు కావు గావుననే నిన్ను మోసపుచ్చినది. తనమనోహరుఁ డొరులతో మాట్లాడ గూడదనియు నెల్లప్పుడును దన యధరామృతమే గ్రోలుచుండవలయుననియు నామె తలంపు.

గోపి—అట్టిభావము స్త్రీజనంబునకుంట సహజమే.

రాధ—తా నెట్లాతని చెట్టఁ బట్టినదో మేమును నట్లే యాతనిచెట్టఁ బట్టినవారము గదా ? అట్టియెడ నామెకున్న యధికారము మాకేల లేదు.

గోపి—అమ్మా ! ఆమెననుటకంటె కృష్ణుననుట మంచిది.

రాధ— ఎందుచేత ?

గోపి—కట్టుకొన్న వారియందును— వలచి తెచ్చుకొన్న వారియందును సమానమగు నాదరభావ మాతఁ డుంచి తీరవలయును. కోరినదానిని స్వాధీన మొనర్చుకొనుటకై యెక్కడలేని తహతహ— స్వాధీనమైన వెనుక నొక్కముద్దు. ఆద్యంతముల కదే ముద్దు. అదిమైనవెను కయ్యమొగ మింకొకవైపు, అమ్మమొగము భూమివైపు. సవతుల నిందచేతను— విరహవేదనచేతను— పతిచేత తిరస్కరింపఁ బడితినే యను విచారముచేతను— బొడము కన్నీరు సెలయేరులై గండభాగములపైనుండి—యురస్థలినుండి— యూరువులపైనుండి— యుర్విపైఁబడుట-సవతినిందలు నెత్తిపైఁ బడుట— పైవారి యాక్షేపణలంతరంతికమున కెగురుట— ధు— ధు— ఏవి వైవాహికసౌఖ్య

మమ్మా! ఐహికమున సౌఖ్యమున్న దన్న చవటదద్దమ్మ నీద
వృడ నాదవృడ మనసుదీర వాయించినను బాపమున్నదా ?

రాధ —నాకిప్పు డావేదాంత మెందుకే ?

గోపి విభునిచే విసర్జింపబడిన వనితకు వేదాంతము కంటె సమ్యగ్ద
ర్శన మేమున్నది ?

రాధ - (ఏడ్చుచు) విభునిచే విసర్జింపఁ బడితినందువా ?

గోపి . నీయం దాతని కనురాగమే యున్నచో—నీదూతికనగు
నన్నాతఁ డెంత గౌరవింపవలయు నందువు? నీసందేశ మాలిం
చుట కాతఁ డెంత యుత్సాహపడవలయునందువు ? నిన్నుఁ
గాంచుట కాతఁ డెంత తత్తఱ పడవలయునందువు ? నిన్నుఁ
గూడుట కాతఁ డెంత ముచ్చట పడవలయునందువు ? నిన్ను
సంతోష పెట్టుటకై నీదాసి కాతఁడెట్టి బహుమాన మీయవ
లయు నందువు ? పరిక్కనున్న భార్యకైనను దెలియకుండ
సర్మగర్భముగనో—నయనావధానముననో — నెట్టి సందేశ
ము నీయవలయు నందువు ? ......... అట్టిదేమైన నున్నదా?
నన్నుజూచుట కసహ్యపడియెనే ? నీయనుగ్రహ సంపాదన
మొనర్చుకొన దలఁచిన వాఁడు నీదూతిక యనుగ్రహ సంపా
దనము దొంలుత జేసికొనవలయునుగదా ? అట్లు చేయనివాఁడు
నిన్ను నిరసించెననుట కభ్యంతర మున్నదా ? నీలెక్క యాత
నికి లేనట్లేగదా ? నీలెక్క లేనివాఁడు — నీయం దాదరభా
వము లేనివాఁడు—నిన్ను జూచుట కిచ్చగింపనివాఁడు—
నిన్ను విసర్జింపనుండెననుట కేమైన సందియమా ? నీగడప
దొరిక్కనివాఁడు నిన్నుఁ బ్రాతచెప్పుకంటె కనికిష్టముగా
విడచెననుటయే గాదా ? ఇంకేల నీకీ సందియము ?

రాధ—ఆహా ! ఇంకెట్లు నే మనియుండఁ గలను ?

## 5 వ అనుబంధము.

గోపికా! ఆశ్రీకృష్ణభగవానుఁ డిట్లు నన్నాదరణచేయునని నేనెన్నఁ డూహించియైన నుండలేదు. కానిమ్ము. తరువాత వృత్తాంతమేమి?

గోపి—అచ్చటనుండి జాంబవతీదేవి గృహమున కరిగితిని. లోనతలుపు బిగించియున్నది. స్పష్టముగా శ్రీకృష్ణునిమాట లీవలకు వినంబడుచున్నవి. నే నెలుగెత్తి పిలచితిని. జవాబులేదు. పిలిచి పిలిచి విసివి వేసారితిని మఱల మిత్రవింద గృహంబున కరిగితిని.

రాధ—అచ్చటనైన నా మనోనాధుని దర్శనమైనదా?

గోపి—అదిగో! నీమనోనాధుఁడని గొప్పగాఁ జెప్పెదవేమి? నీమనోనాధుఁడే యైనచో నీచెంతనే బడియుండును గాని కొంప కొంపకును స్త్రీలుదూరునా? అతని కొఱకు నీవిట్లు పరితపించుచుండ— నీమాటయైన నాతఁడు తలపెట్టుచుండెనా? ఆతఁ డెంత మాయకాఁడో చూడుము. నే నేయింటి కరిగిన యాయింటనెల్ల నాతని దర్శనమైనదే. ఇన్నియిండ్లలో నున్నవాఁడు నీయింటి యందేల నుండరాదు. నిన్నుఁ గూడుట కాతని కెంతమాత్రమిష్టము లేదు గనుక నే— నిన్నుఁ జూచుటకైన నంగీకారములేదు గావుననే నీగడపనైన నాతఁడు త్రొక్కఁడయ్యెను. వేయిండ్ల పూజారియైన యామాయకాని కొఱకు వెదకుచుండెడి కష్టము నాకును— లేనిపోనివిచారము పెట్టుకొని కృశించుట నీకును— ఇందున్న ఫలములై యున్నవి గాని కార్యలాభ మెంతమాత్రమును లేదు.

రాధ—గోపికా! నీవిరసపు బల్కు లెప్పుడును నున్నవే. చివర మాటయేమి?

గోపి—చివరకు రుక్మిణీదేవి గృహమందు దాయయ్యవారు బరుండి యుండఁగా గాంచితిని. రుక్మిణీదేవిగారితో మీసంగతి మనవి జేసి కృష్ణుని బంపించుమని యామెను మిగుల బ్రార్థించితిని.

రాధ—అందుల కామె యేమనెను?

గోపి—వెంటనే యాస్వామివారి నాయిల్లాలు మేల్కొలిపి యావృత్తాంతమాయన కెఱింగించి నన్నాయనకు జూపించెను.

రాధ—(తనలో) ఈమెబుద్ధి మెచ్చుకొనఁ దగియున్నది. న్యాయాన్యాయములు చక్కగా విమర్శించును. తనభర్తపై తన కెంత యనురాగ మున్నదో యొరులకును నంతియేయని తలంచును. కావుననే యీమె మాయాదరకును నిష్టురాలు. ఈమెయాజ్ఞ మేమెల్లరమును శిరసావహించుదుము. (ప్రకాశముగా) అప్పుడా స్వామివారేమన్నారు?

గోపి—మీ విన్నపమంతయు నాలించి "గోపికా! నీ వెనువెంటనే వచ్చెదను. నీవు వెడలుము" అనిరి. నేను సరేయని వచ్చితిని.

రాధ—నీవు వెంతనుండి దీసికొనిరావలసినది.

గోపి—నాకంత యూహ తోచినదికాదు.

రాధ—గోపికా! నీవువచ్చియే యొకటిరెండు ఝాములైనదిగదా? ఆతఁ డింతవఱకేల రాలేదందువు?

గోపి—ఆయనకు నీబోటి దాసీజన మెందరున్నారో యెఱుఁగ మనవశమా? వారిలో నెవ్వరైన నడ్డుకొనిరేమో?

రాధ—గోపికా! నీవుచెప్పినది సత్యము. నీవు పొమ్ము. నేను స్వయముగా వెడలి నామనోహరుని దోడితెచ్చుకొందును.

గోపి—అమ్మా! నీవుమాత్రి మెక్కడకని పోవఁగలవు?

రాధ—(ఆమాట వినిపించుకొనకయే) కృష్ణా! కృష్ణా!

క. ఇక్కడ నీవిరహానల
మక్కట భరియింపలేక । హా! వెతగొనున
న్నిక్కరణి నుఱచి యేసతి
పక్కను బడియుంటివయ్య । పద్మదళేక్షా.

(అని లేచి) మనోహరా! మనోహరా!! నన్నాదరింపుము. నీకై పరితపించుచున్న నాయటమటం బాపి నాకు ముదంబొనర్పుము. నీదివ్యసుందర వదనారవింద సందర్శన భాగ్యంబు నాకొసంగి నన్ను రక్షింపుము.

సీ. ఎచ్చోటనున్నను నిన్ను । నీనాఁడె వెసఁబట్టి
తనివిదీరఁగ ముద్దు । గొనకయున్న
ఏయింతిపక్కలో । నిమిడియున్నను నిన్నుఁ
గనుఁగొని కౌఁగిలి । బెనుపకున్న
ఏతన్వియాజ్ఞలో । నీవున్నసరియె నీ
యధరామృతంబు బెల్లి । నానకున్న
ఏకాంత లేమన్న । నేమియు వెఱువక
నినుఁబట్టి నాయింట । నిలుపకున్న
తలచినట్టుల నీతోడఁ । గలసిమెలసి
దివ్యతరసౌఖ్యవారాసి । దేలకున్న

యెలమి నీదివ్యదర్శన । మిడకయున్న
రాధ కృశియించి చచ్చు న । నాథనాథ!

(పరిక్రమించి రెండడుగులు వైచి) నందనందనా!

చ. నిను సతతంబునమ్ముకొను । నిక్కపు భక్తులపజ్జ దాగితో
నిను వరియించుకొన్న రమ । ణీమణి కౌఁగిలిలోన జిక్కితో
గనఁబడ వెందు దాగితివొ । కంజదళేక్షణ వేగరమ్ము, రా
ధన బ్రతికించుకొ మ్మరగి । తల్ప! దయానిధి! దీనవత్సలా!!

కృష్ణా! కృష్ణా!! (అని నిష్క్రమించును.)

గోపి—మోహోన్మాదముతో నీమె పీడింబడిపోవుచున్నది. ఈమె కేరివలనను బరాభవము రాకుండ నేను వెన్నాడి గాపాడెద గాక.

(అని నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# రాధాకృష్ణలీల

అను

# చంద్రిముఖీగర్వభంగము.



## ద్వితీయాంకము.



### ప్రథమరంగము.

—(స్థలము:—చంద్రముఖి గృహమునకు ముందటిభాగము)—

[చంద్రముఖి ద్వారముచెంతఁ గూర్చుండి యుండఁగాఁ
తెర లేచును.]

చంద్ర—(తనలో) ప్రాణేశ్వరునకు ప్రాతఃకాలభోజనము బంపించుటకై మాలినిని శీఘ్రముగా రమ్మనమని యనుజ్ఞనీయ నామె యింతవఱకు రాలే దెందుదడసినదోగదా? అయ్యో! అపరాహ్ణము దిరిగిపోయినది. నా యాత్మను డాకల నకనకలాడుచుండును. ఈదౌర్భాగ్యురా లింకను రాదయ్యో. నేనిప్పు డేమి చేయుదును?

[అప్పుడు మాలిని ప్రవేశించుచున్నది.]

చంద్రి—(చూచి) ఏమే నీచురాలా! ఇంతయాలస్యం బేలయొనర్చితివి? నాప్రాణనాథున కాహారము బట్టుకొని వెడలవలయు ననుమాట మఱచితివటే మూఢురాలా!

మాలి—అమ్మా! క్షమింపుము.

చ. వనితయొకర్తు కొప్పువిడి పైఁబడ పైట సతంబుజారి యు
ర్వనిబడ మంచిచెడ్డల వివేకము లేకను వాడవాడలం
మునఁబడి "కృష్ణ! కృష్ణ!! దయతోడ ననుం గనరావె" యంచు న
ల్లన బరుగెత్తుచుండిన విలాసిని గాంచుచు నిల్చిపోయితిన్.

చంద్రి—మాలినీ! ఎవ్వతెయో జారస్త్రీ యట్లు సిగ్గుబిడీయములు విసర్జించి పోవుచుండ నందేమి విచిత్రమున్నదని చూచుచుంటివే. నీవినోదములుముందనుకొంటివా? నావిభున కాహారము ముందనుకొంటివా?

మాలి—అమ్మా! నీవిభున కాహారము గొనిపోవుటే ముందుగాని— నేఁటి యీ దృశ్యము తేపురమ్మన్నను వచ్చునా?

చంద్రి—మదోన్మత్తురాలయి యామె యట్లు జారునకై పర్విడు చుండ నీకేమి వినోదమే వెఱ్ఱిదానా!

మాలి—అమ్మమ్మా! అస్ఖలితబ్రహ్మచారి యగు శ్రీకృష్ణుఁడు జారుఁడా? ఎంతమాటంటివి తల్లీ!

చంద్రి—పదునాఱువేల గోపికలును, యెనమండ్రు పట్టపుదేవులును జాలక- మేనత్తయను వావివిడచి రాధనోడిలో వైచుకొనినది జాలక- సాధ్వీమణియని విఖ్యాతిగనిన వనితామణికి మాన భంగం బొనరించుటకై యత్నించు శ్రీకృష్ణుఁ డస్ఖలిత బ్రహ్మ చారియా? నీ వివేక మిట్లు నీరుగారినదేమే భ్రష్టురాలా! నిరంతర రోగపీడితుఁ డారోగ్యవంతుఁ డందు వేమి వివేకమే! నిత్య మేదోయొకటిమెక్కు నిర్భాగ్యుఁడు నిత్యోపవాసియని వాదింతువేమే మతిలేనిదానా! పవలే రాత్రియనియు, రాత్రి యే పవలనియు, వాదింతువేమే తలతిక్కముండా! పలువురు

సంతానముం బడసిన వనిత కలనైన మగవానిని జూడలేదందు వేమిపాపమే!

మాలి—అమ్మా! నీకుఁ గన్నులున్నవి గాని నీకు నీగర్వము దక్క దక్కఁగల ప్రపంచము నీకు గనంబడదు. వీనులున్నవిగాని నిస్సార్చి పొగడు వాక్యములే నీకు వినంబడునుగాని లోకో త్తరవిషయంబు లేమియు నీకు వినంబడవు. నన్ను జావమం దువా? రుక్మిణి యమునానది దాటవలసి వచ్చినప్పు డామె యానదినిజూచి నమస్కరించి "అస్ఖలితబ్రహ్మచారియగు శ్రీకృష్ణుని యాజ్ఞయైనది నాకు దాటనిమ్ము" అని గోరగనే యమున పాయలై దాటనివ్వలేదా? అది విని మఱచిపోయి తివా?

[ తెరలో ]

శా. ఓదేవోత్తమ! యోరమేశ! దయితా! యోలోకరక్షామణీ
యోదామోదర! కృష్ణ! చంచలహరీ! యోసత్కృపాంభోనిధీ!
యోదీనావన! నాథ! యోరమణ! నిన్నొప్పారు రమ్యాకృతిన్
మోదంబొప్పఁగఁ జూతు నెన్నటికి నా మోహంబు సంధిల్లఁగన్.

మాలి—(ఆలించి) అమ్మా! ఆకాంత యీప్రాంతమునకే వచ్చు చున్నది.

[అప్పుడు రాధ ప్రవేశించుచున్నది.]

రాధ—ఓచిన్నికృష్ణా! నాపై నీకింతటిపంతమేల ? సాయంతనము గా వచ్చినదే. ఇంకను రాకుంటివేమి? నామొర యాలింపవా ? నన్నుఁ గరుణింపవా?

మ. బళిరా కన్నులబెళ్కు లొమ్ముజగి చెప్పన్ రాదు వేణుధ్వనుల్
దలమా యెంచఁగఁ గావిమోవి రుచివింతల్ దేటలేనవ్వు ని

గ్గుబు మాజ్జారె సుధామనోహరమృదూ క్తుల్ మాయు రేయొట్టియొ
ప్పులమప్పు దిలకింమ భాగ్య మహిమంబుల్ మాకునిం కెన్నడో.

ఓనీరజదళనేత్రా! నిత్యకళ్యాణమూర్తి! నీపై మోహంబున నిట్లహో
రాత్రింబు లిట్లు దిరుగుచున్న దానను. నీకటాక్షవీక్షణములు
నాపైం బ్రసరింపం జేసి నీదివ్యదర్శనభాగ్యము నాకొసంగవా?
(అని నిష్క్రమించును.)

చంద్ర—మాలినీ! ఈదౌర్భాగ్య జారస్త్రీ రాధ గాదా?

మాలి—అమ్మా! ఈమె రాధయే గాని- జారిణియందువా?

చంద్ర—ఒకరనుట యేల? పతికన్నుల కారముగొట్టి- యుపపతికై
ప్రాకులాడునది జారిణి కాక మరెవ్వరందుర్వు ?

మాలి—కృష్ణుం డస్ఖలితబ్రహ్మచారియని యున్నదిగదా? అట్టిదే
యీమె వ్యామోహాదంతమున కేమేని చిద్రహస్య మొకటి యుండి
యుండును. దాని నల్పజ్ఞానసమేతులరనుగు మన మెఱుంగం
జాలము.

చంద్ర—నీవుకూడ వారి దుర్మార్గకృత్యముల కించుమించుగా నంగీ
కరించుచుంటివి గాన నందేదియో చిద్రహస్య మున్నదను
చుంటివి. అట్టి దేదైన నందున్నచో నా రహస్యము నాకవగ
తము గావలసినదే.

మాలి—ఎందుచేత ?

చంద్ర—ఎందుచేతనని ప్రశ్నింతువేమే యభాగ్యురాలా? నేను
మహాపతివ్రతను మహాపతివ్రతలకును — మహర్షులకును
దెలియని యంశంబు లీ రేడులోకంబులయందును నుండవని
యెఱుంగవా?

మాలి—(తనలో) అబ్బ! ఈమెగర్వోక్తులు వినంజాలకున్నాను. ఈమె
గర్వపరిహార మెప్పుడగునో గదా?

చంద్రి—మాలినీ! ఈమె నందునకు స్వయముగా చెల్లెలటగాదా?

మాలి—కాదమ్మా! ఈమె చిన్ననాఁటినుండియు నందుని జననీజనకులచెంతఁ బెరిగినది. ఆకారణమున నందుని "అన్నా! అన్నా!" యని పిల్చెడిది.

చంద్రి—ఎట్లయినను వానికి మేనత్తయేగదా? పరపురుషుని గామించుటయే మహాదోషమై పరగుచుండ- మేనల్లుని- తనకంటె జిన్నవానిని- ఈచెడిపె యెట్లుగూడుచున్నదో? హరిహరీ! ఎంతపాపము!!

[పునఃప్రవేశము:—రాధ]

రాధ—మనోహరా!

*మ. యమునాతీరవనాంతసంజనితదా । వాగ్నిస్ఫురార్చిర్ని కా
యము నానాజనభీకర బగుచు డా । యన్ వేరెలేకాచున
య్యము నాయొంబని దానినానెనఁట ని । త్యంబున్ హరిన్ గుప్తసం
యము నారాధనసేయు నాకిపుడభీ । ష్టావాప్తి గాకుండునే.

* శ్లో॥ విదగ్ధగోపాల విలాసినీనాం
సంభోగచిహ్నాఙ్కితసర్వగాత్రం
పవిత్రమామ్నాయగిరా మగమ్యం
బ్రహ్మప్రపద్యే నవనీతచోరమ్॥

మాలి—అమ్మా! కర్ణానందముగా వినుమమ్మా! ఆమె యెంతటి భక్తురాలోగనుగొనుమమ్మా! అట్టిమహాభక్తురాలికి పాపమొకటి యుండునటమ్మా!

చంద్రి—ఆశ్లోకార్థ మేమైన నాలోచించితివా? "విదగ్ధగోపాలవిలాసినీనాం" అనఁగా నవలావణ్యవిలాసినులైన గోపస్త్రీలయొక్క- "సంభోగ చిహ్నాఙ్కితసర్వగాత్రమ్" అనఁగా రతియొక్క- గుఱుతులచేత గుఱుతిడబడిన "సర్వగాత్రమ్" ఎల్లశరీరమును

అనగా నవలావణ్య విలాసిను లైనగోపస్త్రీలతో రమించిన గుర్తులు శరీరమందుంతటను గాన్పించుచున్నవాఁడా! అనియర్థము. ఈసంబోధన మెవరికో తెలియునా? అస్ఖలిత బ్రహ్మచారియని నీవింతవఱ కెవ్వని గూర్చియంటివో యాతనికే. అస్ఖలితబ్రహ్మచారీ! యనిసంబోధించు టానందం బౌనగూర్చును గాని "అనవరతగోపాంగనా హృష్టవిలోకనా" అని యసందర్భముగా సంబోధింపవచ్చునా? ఇట్టి దిక్కుమాలిన బిరుదులే యాకృష్ణునకుఁ గర్ణపేయమగునా?

రాధ—(చంద్రముఖిని సమీపించి) అమ్మా! శ్రీకృష్ణభగవాను డిందున్నాఁడా ?

చంద్ర—(క్రోధముతో) ఓసీ కులపాంసురాలా ! నేను నీవలె వ్యభిచారిణిననుకొంటివా ? ఆదార్భాగ్యశిరోమణియగు కృష్ణుండు నాయింటి కేలవచ్చును.

రాధ—అమ్మా! లెంపలువాయించుకొమ్ము. ఆతని నిందించినందులకదియే సిద్ధౌషధము. ఆమహామహుని మహాత్మ్య మీ వేమెఱుంగుదువు తల్లీ !

చంద్ర—ఆతని మహామహిమమే నెల్లెరుంగుదునే కులటా ! ఆమిండకాడొక కొండనెత్తెను. నీవాతని నెత్తి విలాసముగా మోసితివి. అట్టి మీయిరువురి మాహాత్మ్యమును నేనెఱుంగగలనా? ఇంచుకైనను సిగ్గులేక విటకత్తెవై నీవిటకానికొఱకు వీధివీధులంబడి తిరుగుచుంటివా? నీచురాలా! స్త్రీజనంబునకుఁ దలవంపులుగూర్చు నీదియునొక జన్మమేనట. నీముద్దుకృష్ణుఁడు ముక్కిటిపాలుగాను.

రాధ—(చెవులుమూసుకొని) అమంగళము ప్రతిహతమగుఁగాక.

చంద్ర—(క్రోధముతో) ఓసీ! మాయలాడీ ! కులటా! ఇంతలోననే

నాతిట్లు మీజారచోరశిఖామణికి దవ్వులుననుకొంటివా? ఇంత మాత్రమునకే చచ్చెడివాఁడుగాఁడులెమ్ము. జన్మమెత్తినందుల కు జ్ఞానముండవలయును. అగ్నిసాక్షిగా పాణిగ్రహణమొనర్చి న భర్తను విడనాడి పైపురుషుని బతిగాజేసుకొంటివేమే నీచు రాలా! సతీధర్మమును విడచి — మానవతులకెల్లను దలవంపు గూర్చి పతినివిడచి పైవానిపజ్జజేరి కులుకుచుండెడి నీయట్టి పతితురాలను.—పరమనీచురాలను —కులటను నాయట్టి మ హాపతివ్రత చూడదటస్థించినచో ఘోరనరకము దటస్థించును.

రాధ — (నమస్కరించుచు) అమ్మా! నీవు మహాపతివ్రతవా ? అట్ల యిన నీమగనితో నీవు స్వర్గపురంబునకేగుము. అంతియేకాని ని తరుల నేలదూషించెదవు? నన్నేమిచేయమందువు? నాపతి నా కనుకూలవర్తనుఁడుగాఁడు. అందుచే జగతీనాథుని నాథునిగా బడసితిని. అట్లు బడయుగల్గుట నాభాగ్యమని గర్వించుచు న్నాను. అట్టినన్నేల దూషించెదవు! అమ్మా! నాకు దెలియ కడుగుచున్నాను. నీవీ పురంబునకుఁ గ్రొత్తగా కాపురమునకు వచ్చినట్లున్నావు. అగునా ?

మాలి—నీవెట్లు గ్రహించితివి ?

చంద్ర—మాలినీ! నీకేమి పిచ్చియా ?

తే. గీ. గ్రామమందున నడచుసం । గతులు నెల్ల
జారకాంత యింట, నడి బ । జారునాదు
కల్లుపాకను పల్వురు । గలియుచోట
విశదమగుచుండు ననుమాట । వినఁగలేదె ?

ఈమెజారిణిగదా? గ్రామమున కెవ్వతె క్రొత్తగవచ్చినదో యెవతె యెవనితో బొరలుచున్నదో గ్రహించుట కేమిలోపము. అం తియేనా రాధా ?

రాధ — ఓవివేకవంతురాలా! అదిగాదు.

శా. శ్రీకృష్ణప్రభుచర్య లెల్లఁగని యీ । రేపల్లె వారెల్లరున్
లోకాతీతుఁ డనాదిమధ్యమయుఁడం । చున్ నమ్మి సర్వంసహా
శ్రీకృష్ణార్పణమస్తటం చతని యా । శీర్వాదమున్ బొందఁగా
నాకాంక్షింపఁగ నీవు కాదనుట కొ్రై । స్త్రీయుం లచే గాదొకో.

చంద్రి — చాలుచాలు. "సర్వంసహా శ్రీకృష్ణార్పణమస్తు" అని యనవలయునా? ఇదెట్టిన్యాయమె మూఢురాలా!

తే. గీ. ధరమహాపతివ్రతకేను । దాసుఁడనని
యాదిమధ్యాంత రహితుఁడే । యనినయప్డు
తనపతికిగాక దేవదే । వునకునైన
నొడలొసఁగు స్త్రీసతీత్వమె । య్యెడల నిలచు
నిలచుగాక లాభంబేమి । గలదె లలన ?

రాధ — అమ్మా! నీ, నా, భేదమున్న నీవంటివారికే నీజెప్పిన నీతి వర్తించును. ప్రపంచమంతయు బరమాత్మ స్వరూపముగాఁ దలంచి, నీ, నా, భేదమునెవిడచి వర్తించువారికే నానీతి వర్తించును. ఇందున్న పరమరహస్యం బిదియే.

చంద్రి — అట్లయిన నేను పతివ్రతనుగదా ? నాకాదేవదేవుఁడు దాసుడుగాడందువా ?

రాధ — నీది కేవలమడియాస.

చంద్రి — ఎందుచేత ?

రాధ — నేను మహాపతివ్రతను అను మహాగర్వము నీకున్నది. నీవనగనెవ్వతవో నీవెఱుంగువఱకా దేవదేవుఁడు నీకుదాసుఁడుగాఁడు.

చంద్రి — నీబోటి నీచకులాంగనా పాదదాసుండగు నీశ్రీకృష్ణుఁడు దేవదేవుడెన్నటికిగాఁజాలఁడు. ఒకానొకవేళనైనను నాతఁడు

*నాబోటి మహాపతివ్రతకు దాసుఁడు గాదగఁడు. అగునుగాని*
స్త్రీకళంకార మెద్ది ?

రాధ—లజ్జ.

చంద్రి—స్త్రీ లెవరిని ప్రేమింపవలయును ?

రాధ—మనోహరుని.

చంద్రి—స్త్రీలకు ముక్తిసాధన మెద్ది ?

రాధ—మనోహరు పాదారవిందసేవనము.

చంద్రి—మనోహరుఁ డన నెవ్వఁడు ?

రాధ—మనస్సును హరించినవాఁడు.

చంద్రి—అది తెలియును. దాని కింకొక యర్థమేమి ?

రాధ—ప్రాణనాథుఁడు.

చంద్రి—అనఁగా పతియనియా? ఉపపతియనియా నీయర్థము.

రాధ—నీరెండవయర్థమిచ్చుట నుపకరింపదు. నీది కేవలము భ్రాంతి.

చంద్ర—ఓయి భాగ్యశిరోమణీ ! నారెండవయర్థ మిచ్చుట నేలవర్తింపదు. "మనస్సుహరించినవాఁడు" అను యర్థమటుంచుము. స్త్రీలకుదాళిగట్టినవాఁడుభర్త. అట్టిభర్త కండ్లలోఁ గారమును గొట్టి పెరవానితోఁ గూడుట నీకుభావ్యమా ? అదిసాధ్వీలక్షణమా ? నామాటవినుము. నీచేసినపాపమునకుఁ బశ్చాత్తాప పడుము. క్షమించుమని నీభర్తపాదములపై వ్రాలుము. పతివ్రతలలోఁ లెక్కింపబడుట కవకాశము గల్గించుకొమ్ము.

రాధ—నీది మొండిపట్టు. సత్యము నీతలకెక్కదు. నీవనుకొనినట్లిది వ్యభిచారముగాదు. ఆశ్రీకృష్ణపరబ్రహ్మలీలలు వర్ణింప నీబోటి మందురాలికి దుస్సాధ్యము. వినదలంచితివేని యామహాత్ముని లీలల వర్ణించెదను విందువా ?

సీ. తినలేదు మన్నని । తనవక్త్రమునఁజూపి
సర్వప్రపంచముల్ । జననికెలమి
శకటాసురాది రా । క్షసులను జిఱుతరా
బాల్యంబునందునఁ । బట్టిచంపె
మహితలీలలనెన్నొ । మాతకున్ జూపుచు
నలకూబరుల శాప । ముల నడంచె
కాళీయఫణిఫణా । గ్రము నెక్కి తాండవం
బాడి లోకంబుల । నరసిగాచె
జ్ఞానులైనట్టి సనకాది । మౌనులెల్ల
దేవదేవుఁ డితఁడని ను । తింతు రితని
యట్టి శ్రీకృష్ణచారిత్రి । మిట్టి తెలుప
పడతి! నను బోలుకాంతకు । వశమె చెపుమ.

ఆదేవదేవుని దివ్యచరిత్రంబు లన్నియునువిని కండ్లారగని యానందించు మహాభాగ్య మెంతటివారికి లభ్యంబగును! ఆకృష్ణస్వామి జననకాలమున నడచిన విపరీతపుచర్య లీ వేమెఱుంగుదువు? సర్వజగదోద్ధారకుండగు నానారాయణమూర్తి లీలామానుషవిగ్రహుండై శ్రీకృష్ణావతారమెత్తుచున్న తరుణంబున

సీ. స్వచ్ఛంబులై పొంగె । జలరాసులేదును
గలఘోషణముల మే । ఘంబులుఱిమె
గ్రహతారకలతోడ । గగనంబురాజిల్లె
దిక్కులు మిక్కిలి । తెలివిదాల్చె
గమ్మని చల్లని । గాలిమెల్లనవీచె
హోమానలంబు సె । న్నొందివెలిఁగెఁ
గొలఁకులు కమలాళి । కులములై సిరినొప్పె
బ్రవిమలతోయలై । పాఱెనదులు

వరపురగ్రామ ఘోషమై । వసుధయొప్పె
విహగరవపుష్పఫలముల । వెలసెవనము
లలరుసోనలు గురిసి ర । య్యమరవరులు
దేవదేవుని దేవకీ । దేవి గనగ.

అట్లు జన్మించిన శ్రీకృష్ణుండు అవతారపురుషుండని యెఱింగి—ఆతని దివ్యచరిత్రలన్నియు లీలలనియెఱింగి అమ్మహనీయుని సందర్శనం బలవడినంతమాత్రమున జన్మరాహిత్యంబు గలుగునని గ్రహించి—మానిజనదుర్లభంబైన యామహామహుని దివ్యపాదారవిందసేవ లభించుచుండెనని యెఱింగి...(అర్థోక్తిలో)

చంద్రి ఓదుర్మదాంధురాలా! స్త్రీకులకలంకనీ!! ఏమే నీవాచాలత్వము మేఱమీఱుచున్నది? నీకృష్ణుని విపరీతచర్యలలోఁ గొన్నికాకున్న గొన్నియైన నేవినియుంటిని. అవియన్నియు భగవంతుని లీలలని భ్రమయకుము.

సీ. మిసిమిముద్దులు మెక్క । మిక్కిలి వేడ్కతో
నిల్లిల్లుదూఱుట । దెట్టిలీల
పెఱభామినులఁ బట్టి । సరసంబులాడఁగా
నిట్టి పర్వెత్తుట । దెట్టిలీల
జలకేళిదేలెడి । లలనలకోకలఁ
బట్టి చెట్లెక్కుట । దెట్టిలీల
పురుషులిండ్లనులేని । తరుణంబుననుఁబోయి
యిల్లాండ్ర నేచుట । దెట్టిలీల
యిట్టివన్నియు లీలలై । యెసఁగునేని
దైవకృత్యంబు లిట్టివై । దనరునేని
యెండ వెన్నెల చీఁకట । దెంతొ వెలుఁగు
గాంచుమను మూర్ఖవాదంబు । కాకయున్నె.

రాధ—అమ్మా! ఆమహామహుని చర్య లర్థము జేసికొనలేక మూర్ఖురాలవై పోవుచుంటివేమి? నీబోటి తెలిసియు దెలియని దానికి దెలియఁజెప్ప బ్రహ్మదేవుని తరమగునా? నాకేల నీతో వృథావాదము. ఆసర్వజగద్రక్షకుని నిందించుట నీకు మిగుల పాపము.

చంద్రి—దుష్టులదూరుట తప్పా?

రాధ—దుష్టుఁడో దుష్టుల శిక్షించు దేవుఁడో నీ కెఱుఁగఁజాల వనుచుంటిని.

చంద్రి—(హేళనగా) ఆహాహా! ఆతఁడొక దేవదేవుఁడు. నీవొక మహాపతివ్రతామణివి. అంతకుఁ దగిన బొంతయనినట్లు మీ యిద్దరకును సరిపోయినది. నీవలపుకాఁడు నీపాలిటికి నీకు దేవుఁడై గాన్పింపఁడా? నీదేవుని నీవు గొల్చుకొనుచు- తప్పు జేసితినని యిల్లు దూరవలయునుగాని- యోమిండకానినే మమ్ముందఱఁ గొల్వమందువేమి? అట్లు చెప్పుటకు నీకు సిగ్గు బిడెములు లేవా? పడపుకత్తియవగు నీవు నాగడప తొక్కినందులకు నిన్నును, నీపతినిగూడ నానాథునితో జెప్పి శిక్షించెద నుండుము.

రాధ—కృష్ణునితో జెప్పి నేను నీగర్వపరిహార మొనరింతును.

చంద్రి—ఛీఛీ! పో బానిసముండా! (అని లేచి) మాలినీ! రమ్ము లోనికి. (అని నిష్క్రమించును.)

రాధ—నందనందనా! రుక్మిణీవల్లభా!

సీ. దేవదేవుఁడవంచు । దెలియక దుర్భాష
లాడు రుక్మిగర్వంబు । నణచినావు
వసుధ నస్ఖలితపు । బ్రహ్మచారి నటంచు
నలరు నారదుగర్వ । మణచినావు

రాళ్ళవర్షము గుప్పి । రాపెట్టు, నముచిసూ
దనుగర్వ మొక్కట । నణచినావు
బలశాలినని గర్వ । పడిపోవుచుండెడి
యాఖగేంద్రుని గర్వ । మణచినావు
నిన్ను దెలియక నిందించు । నిఖిలజనుల
నరసి వారలగర్వంబు । లణగద్రొక్కి
యలరు నోసామి నాకోర్కె । నాదరించి
దీనిగర్వంబు నణచుమో । దేవదేవ.

(అని నిష్క్రమించును.

ద్వితీయరంగము.

స్థలము —చంద్రముఖి గృహమునం దొకభాగము.

[చంద్రముఖి కూర్చుండియుండఁగాఁ దెఱలేచును.]

చంద్ర—(తనలో) నిశ్చయముగా రాధ జారిణిగావుననే నేనెన్ని యన్నను విననియట్లు నటించి మొండిసమాధానము లిచ్చినది. అయ్యో! ఇది యెక్కడి పాపకాలమోగాని యగ్నిసాక్షిగ గైకొన్న భర్తను విడచి పైవానికై ప్రాకులాడుటయే న్యాయమనుచుండెరి. తాను జేసినదెంతయో మహత్కార్యమనుకొని విఱ్ఱవీగు నీదుర్మదాంధురాలి గర్వమడంచి దాసోహమనిపించిన గాని నామన మూరటజెందదు. దీనికింత కండకావరమా? వ్యభిచార మహార్ణవంబునఁ బడి యలయక-యంతుదఱిలేక- నీకులాడు నీవ్రజబాలుఁడు దేవదేవుఁడా? ఆతనిని గొలువవలయునా?- కొలుచుటనిన పోనీ నిర్జీవప్రతిమను గొల్చునట్లు గొలువవచ్చును గాని- మానమర్పించిన గాని మోక్షములేదనుట మౌఢ్యముగాదా? నాప్రాణే

శ్వరునితోఁ జెప్పి దీనిని బులుసుకోని కెనుక లేకుండ తన్నించి తీరెదను.

[అప్పుడు వేదవ్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వేద—(తనలో) పొద్దుటాల లెగిసిందిమొదలు పొలంలో నెక్కలా పని సేత్తున్నానుగందా ? నాకట్ట మాలోసింపకుండా- నా కూడంపకుండా- సేటపెయ్యనా గింటికాడ కూకు నిదేం జేత్తోందో కనుక్కోవాలి (అని సమీపించి పైకి) ఏంయే. ఏం టాలోసిత్తున్నావు. ఈడికి కూడంపకపోతే సత్తాడా ? సావడా అనా ? అంతేనా నీయాలోశన.

చంద్రి—(భర్తకు నమస్కరించి) పాపము శమించుగాక. నాథా ! మీ కాకాహారము బాపుచుండ నొక దుర్మార్గురాలితో నకారణ కలహము సంభవించినది ! ఆ కారణమున మనసు చెదరిపోయి నది. తప్పు క్షమించుఁడు.

వేద—ఏకో బొంక. నీసదువేంటి ? నువ్వేంటి ? నీపుత్తకాలేంటి ? నీదంతా దొంగత్తు.

చంద్రి - (ఏడ్చుచు) నాథా ! మీపాదమాన. నిజము వచించు చున్నాను.

వేద — ఓసెందుకేడుత్తవే. నీకేరితోటే యిరోదమొత్త. సెప్పేసి (తనచేతిలోని కర్ర చూపుచు) ఆళ్ళెవళ్లో సెప్పంవెందే. సెప్పు సెప్పినావంటే దీనితో వాళ్ళతలకాయ పగలనూకా నన్ను మాటే. సెప్పమంటే సెప్పకుండా ఏడుత్తావెందుకే యెట్టిమొగమా ? (వీపుపై దట్టుచు) ఏదన్నంటే యెట్టిబాగులో డనుకున్నావేంటి. ఎనిమిదొందలమందినేనా పుచ్చె లెగ కేత్తా నీఒక్కచెయ్యితో. నామజాకా నీకేం తెలుసు. ఆ ళ్ళెవళ్లో సెప్పు. ఆపైన సూడు నాతమాచా.

6 వ అనుబంధము.

ఇనుకో నాబుద్దినుకో. నిన్నన్న దోరో సెప్పు.

చంద్రి—ఇంతకుబూర్వము మాలినితో నేనేమో మాట్లాడుచుండ వింతలో జారిణియగు రాధ పిచ్చయెత్తినట్లు వాడవాడలంబడి 'కృష్ణా! బాలకృష్ణా! నాచిన్నికృష్ణా! రమ్మా! కౌఁగిలిమ్మా!' యని యార్చుచు సిగ్గుబిడెములు విసర్జించి పోవుచుండెను. అట్లుపోవుచు బోవుచు గుమ్మములోనున్న నన్నుఁ గాంచి బిరబిర నాయింటికి వచ్చి "నాకృష్ణుఁడు నీయింటిలో నున్నాఁడా?" అని యడిగినది.

వేద—సరి. సరి. సరసంగానేయుంది. నువ్వేమన్నా?

చంద్రి—అప్పుడు నే నాపతితురాలిం గాంచి స్త్రీజనంబులకు పతిని సేవించుటయే పరమధర్మమనియు, పరపురుషునిగూడిన కాంతకు ఘోరనరకంబు ప్రాప్తించుననియు- కావున మంచిబుద్ధి గలిగియుండుమనియు- నీపతినే నీవు దైవమట్ల భావించుకొమ్మనియు- బోధించి- అటుపైన శ్రీకృష్ణుఁడు నీకు మేనల్లుఁడు గదా? అట్టివానిని గవయు టధర్మమనియు హెచ్చరించితిని. "యథార్థవాదీ బహుజనవిరోధి" యను న్యాయము నాపట్ల నిజమైనది.

వేద—సచ్చీటట్టు సెప్పావే నీసిగదరగ. పుత్తకాలు సదివితే బుద్ధులొత్తయిగావూసు. దానికేంగాని నీమాట విని యేవందేంటి?

చంద్రి—నాహితవాక్యము లామె తలకెక్కినవిగావు. నావాక్యము లాలించి చేతులతో మూతులతో నన్నుఁ బొడుచుచు, "ఇది యనవచ్చు, నిది యనరాదను వివక్షతలేక సమయాసమయము లెఱుంగక నోటికివచ్చినట్లుగా నన్నాడిపోసినది. తనమిండగానితో జెప్పి నాసతీత్వము బాడుచేయించెద నన్నది. దాని

ప్రతిజ్ఞ కాలిపోను. దానిమిండకాఁడు రాలిపోను. నిన్నుఁ జూడక, నీవంశమునుజూడక, నీచెట్టఁబట్టి సుఖంచుచు మహా పతివ్రతనై విరాజిల్లుచున్న నన్నేడిపించునా? అన్యాయము గా నావంటి సతీరత్నము నేడ్పించిన మహాపాప మూరక పోవునా? దానివంశము నిర్ధూమధామమై పోవదా? నేనెట్టి మహోత్కృష్టవంశమున జన్మించితినో చూడవలదా? నే మెట్టిన వంశమునైనను గణింపవలదా?

వేద—అదల్లా తెయితక్కలాడితే నువ్వూరకున్నావంట.

చంద్ర—ఊరకొనక దానితోఁబాటు నన్నును పైతక్కలాడుమం టిరా? అది మగనాలికి ధర్మమగునా? నే నూరకొన్న కొలఁది యుం నది పెచ్చుపెరిగి మీఁదమీఁదకు వచ్చుటగాంచి యొక్కమాటమాత్ర మంటిని. "నాప్రాణేశ్వరుఁడు వచ్చిన తరువాత నీదురంత మాఱంగించి నీకును, నీకృష్ణునకునుఁ దగి నట్లు బుద్ధిచెప్పించెద" ఇదియే నేనన్నమాట. ఆమాటతో నీశ్వరవేరుచూచిన సర్పంబుభాతి తలవాల్చుకొని వెడలి పోయినది.

వేద—నేనంటే దానికొంచెము బయముందిలే.

చంద్ర—నాథా! మీరా పాపురాలి నించుక శిక్షించినఁగాని దానికి బుద్ధిరాదు. దాని మిడిమిడిపాటడంగదు. దానితోఁబాటామె మిండనికిఁగూడ తగినట్లు బుద్ధిసెప్పుడు. నాథా! ఇట్లుజేసి— నాప్రతిజ్ఞ మీరు బరిపాలించి- నాకెనలేని యానంద మొసంగి నన్నాదరింపరా?

వేద—అదెంత బాగ్గెంగాని- గడ్డిదినే కూతలు వో రెన్నుకుంటే నీకేం. నీగుణం- నీబుద్ధి- నీపతిరతతనము నాకు తెల్సులామె. ఆరాదబతుక్కి నిన్ను తిడద్దా? దానిమొగుఁ డున్నాఁడేం

సవటదద్దమ్మ. యెఱ్ఱిముండాకొడుకు. నాయట్టి పవ్వురోసం గల వాండైతేనా తునకలు, తునకలుజేసి మెడగుళ్ళట్టు కావలికి గెంటేసేద్దును. ఆయెదవదాని బతుక్కుతోడ నిన్నగతా లాడిందా ? నాతావునంటే బుఱ్ఱ సితగమొదుద్దును.

చంద్రి—పుష్టుండగు కృష్ణునిజూచి యది మిడిసిమిడిసి పడుచున్నది.

వేద—అవ్వనుగాని కుట్టం డెప్పుడేనా నిన్ను సూశాడంటే.

చంద్రి—వానిబొంద. వానికి నావంటిమహాపతివ్రత కనుపించునా ? నాసంగతి దెలిసికొన నాయింటికాతండు వచ్చినను భస్మము చేసివేయనా ? నాపాతివ్రత్య మాహాత్మ్యము ముందాతం డాగగలండా ? వెఱ్ఱిమాట.

వేద—నువ్వు సదువుకున్నావు గందా ? మావోళ్ళాడిని దేవుడంటా రేంటే.

చంద్రి—మీకును పిచ్చియా యేమి ?

కం. ఇటువంటి జారులందరు
పటుతర దైవంబులైన । వసుధాతల మె
ట్లటమట బడిపోవునో ? సం
కట బడిపోవునొ గ్రహింప । గలమే నాధా ?

వేద—అయితే. ఆండు దేవుండు గాడంటవా ?

చంద్రి—కాండు. కాండు.

వేద—మఱి మావోళ్ళంతా వాణ్ణి కొలుత్తారెందుకే.

చంద్రి—అట్టి వెఱ్ఱితనమునకే గొల్లవెఱ్ఱి యందురు.

వేద—నువ్వాల్లా గంటావుగదా ? ఆడు సాలా గొప్పగొప్ప పనులు సేశాడే.

చంద్రి—అంతకంటె గొప్పపనులు జేయవచ్చును. ఏవియో కొన్ని మందులును కొన్నిమంత్రములును నేర్చినం జాలును.

సీ. ఈశ్వరు వేరుచే । నిట్టి పామునుబట్టి
గడతొక్కి వాని దే । వు డనఁదగునె?
కట్టుమోతును బెట్టి । కంసాదులను జంప
జాలుట దేవుని । శక్తియగునె?
విప్రవినోదుని । విధముగా మాయల
నొనరింపఁ బరమేశుఁ । డనఁగఁదగునె?
మంత్రతంత్రంబుల । మహిమచే జేసిన
పనులెల్ల దేవుని । పనులెయగునె?
వలపుమందుల నిడి గోప । వనితల నెటో
వశము జేసుక నున్నంతఁ । బరుఁడటంచు
తలఁచి, మీరెల్ల పొగడఁగాఁ । భళిభళీ, య
టంచు గర్వించి యున్నవాఁ । డతఁడు నాథ.

వేద—ఈమారు నచ్చిందే. నాకు కూడెట్టు. తినెల్లి రాద బాదేంటో కనుక్కొత్తా.

చంద్ర—మంచిది రండు.

(నిష్క్రమింతురు.)

## తృతీయ రంగము.

—। స్థలము:— రుక్మిణియంతఃపురము. ।—

[కృష్ణుఁ డొకచోఁ గూర్చుండి యుండును.]

కృష్ణు—(తనలో) చంద్రముఖి నన్ననవరతమును దూషించుచుండెను. ఆమె వివేకవంతురాలేగాని యీవిషయంబున మాత్రమామె మాఢ్యమునకు మేరలేకుండనున్నది. నాలీలలన్నియు నెఱింగియు, నేనొనర్చిన యద్భుతంబులన్నియు వినియు నేనే యాదినారాయణుండనని యెఱుంగకుండ నున్నది.

నామహాత్మ్యమెల్ల వినినపిదపఁగూడ నామె మూర్ఖత నడఁగకున్నదే. ఈమె కొకమారు నామహాత్మ్యముఁజూపి యీమె గర్వపరిహార మొనర్పవలయును. ఆహాహా! ఏమి యీ జనులమౌఢ్యత! నాచే సృష్టింపఁబడిన యనంతకోటి జనరాసుల యందును మానవులకే జ్ఞానమొసంగియున్నాను. అట్టిజ్ఞానమును వారన్యథా వ్యయపుచ్చి మాత్సర్యవర్తనులయి నీ, నా, యను సకురదాసులై, సృష్టిని, నన్నును, గూడ మఱచి, ప్రపంచమేమఱచి, నాయాధిక్యతసంతయు వారిపై వైచుకొని నన్ను స్మరించుట మానివైచిరి. సరిగదా నన్ను దూషింపఁ గడఁగిరి. అట్టివారల కొక్కొక్కరి కొక్కొక్క గుణపాఠముఁ జెప్పి వారల సన్మార్గవర్తనులఁగావరించితిని. అప్పటికిని నాహిత వాలింపక, నన్ను గణింపక లోకంబుల లయించెడి దుష్టులబట్టి వధించి వారికి ముక్తినొసంగితిని. ఇప్పుడీచంద్రముఖి లోకద్రోహిని కాలేదు గాని భగవద్దూషణ మొనరించుచున్నది. ఈమె మౌఢ్యమును హరించి భక్తురాలినిగా జేయవలయును. అట్లుచేయుటకొక కష్టములోని యంశముగాదు.

తే. గీ. చూడ సత్సతీమణికి దా । సుఁడనె గాని
పతియె దైవము, దైవమే । పతియటంచు
భేదభావము లేక వి । వేకమతిని
జూడనట్టువంటిసతికి దా । సుఁడనుగాను.

ఈచంద్రముఖి తననాథుఁడే తనకు దైవమని నమ్ముకొనియున్నదే గాని దైవమే తననాథుఁడై యుండెనని గ్రహింపఁజాలకున్నది. ఆనీతి నీమెకు గఱపి పతిభక్తియు దైవభక్తియు బోధించి యీమె వెనుకటి గర్వభంజన మొనరింపవలయును. ఇందుల

రుక్మి—నాథా! నన్నేల నెకసక్కెములాడెదరు. మీ హృదయేశ్వరి యగు సత్యభామ కంటెను నేనెక్కుడుదాననా ? ఆమాట కేమి గాని నాదియొక మనవి. మీకంటె నేనెక్కువ తెలిసిన దానను గాను గాని —

తే. గీ. ఘనపతివ్రతతోఁ జెల । గాటమన్న
సాటి లేనట్టి యాపద । సంభవించు
ననుచు దెలిసియు చంద్రము । ఖిని స్పృశింప
దలఁచి నారఁట భావ్యమే । జలజనయన !

కృష్ణు—ఈ వార్త నారదుఁడు నీకెఱిగించెనా ?

రుక్మి—సర్వజగద్రక్షకా ! నీవెఱుఁగని యాశంబులేమియుండును ?

కృష్ణు —సరే. అంతయు వింటివిగదా? ఇందు నీయభిమత మేమి ?

రుక్మి—ఆమె గర్వాంధురాలయి పరంధాముండవగు నిన్నెఱుఁగకుం డనున్నది. సామాన్యవ్రజబాలుండవని దలంచి యనేకగ తుల నిందించుచున్నది. అట్టిగర్వముడిపి శ్రీకృష్ణుఁడే లోకా రాధ్యుఁడగు నారాయణుఁడని గ్రహించునట్లు లొనరింపవ సినదేగాని యామె సతీత్వమునకు భంగము దేరాదు.

తే. గీ. మానభంగంబు జేయఁగా । బూనుకొనక
యాదిదేవుండె శ్రీకృష్ణు । డనుచుఁ దెలిసి
కొంటి నాదుగర్వమడఁచు । కొంటిననుచుఁ
గాళ్ళపై వ్రాలునట్లు జేయ । కర్జమరయ.

శ్రీకృ—పట్టీదానా ! నాబిడ్డలయందున నాకెన్నటికిని భేదభావము లేదు. ఆసత్సతీమణి మానభంగం బొనరించుటకే నేలయత్నింతును. నామనోభావ మెట్టిదియో, యామె గర్వభంజన మెట్లగునో జూతుము. (అని నేత్రములు ముట్టుచున్నాఁడు.)

రుక్మి—(చూచి) హే ! మహాత్మా ! ఆదిమధ్యాంతరహితా ! అనం
తా ! నీమహామహిమ దెలియుఁగ నాకు వశమా ?

7 వ అనుబంధము.

తే. గీ. దేవదేవుని మహిమంబు । దెలియ లేక
కన్నుమిన్నునుఁగానక । గర్వపడెడి
చంద్రముఖి నీదు దయచేత । జ్ఞానముగొని
పతితపావనురాలయ్యె । పరమపురుష.

[అప్పుడు వృద్ధుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఉద్ధ—(చేతులు జోడించి)

శ్లో॥ మునిశ్రేణీవన్ద్యాం మదభరలసద్వల్లవవధూ
స్తనశ్రోణీబిమ్బస్తిమిత నయనాంభోజసుభగమ్
పునశ్లాఘాభూమింపులకితగిరాంనైగమగిరాం
ఘనశ్యామంపద్రేకిమపికమనీయాకృతిమహః॥

(అని నమస్కరించుచున్నాఁడు.)

కృష్ణు — ఉద్ధవా ! ఎక్కడనుండి వచ్చుచున్నావు?
ఉద్ధ—స్వామీ ! సత్యభామ గృహంబుననుండి.
కృష్ణు—క్రొత్తవింత లేమియును లేవుగదా ?
ఉద్ధ—దేవా ! క్రొత్తలేమియును లేవు. మీరేకారణముననో రాధ
ను మఱచిపోయిరఁట. ఆమె మీకొఱకై రేపల్లెవాడ యెల్ల
నున్మాదినియై దిరిగినది. నన్నుఁ బంపినది. ఇచ్చట నుందురని
వచ్చితిని. దేవా! ఆమె మిగుల విచారించుచు మీకొకసందేశ
మంపినది. వినుఁడు ఆమె వాక్యరత్నము లివి.

సీ. తనుఁబాసి యొక్కింత । తడవైన నిటమీఁద
నేలపై మేనులు । నిలువవనుము

నేలపై మేనులు । నిలువక యటమున్న
ధైర్యంబులొక్కటఁ । దలఁగుననుము
ధైర్యంబులొక్కటఁ । దలఁగినపిమ్మటఁ
జిత్తంబులిక్కడ । చిక్కవనుము
చిత్తంబులిక్కడఁ । జిక్కకవచ్చినఁ
బ్రాణంబులుండక । పాయుననుము
ప్రాణములు వోవ మఱివచ్చి । ప్రాణవిభుఁడు
ప్రాణరక్షకుఁడగు తన్ను । బ్రాణులెల్లఁ
జేరి దూఱంగ మఱియేమి । సేయువాఁడు
వేగ విన్నపమొనరింప । వేమహాత్మ!

కృష్ణ—ఉద్ధవా! నీవరిగి నేనిప్పుడే వచ్చుచున్నానని యెఱింగింపుము. కాలవిలంబన మెంతమాత్రమును జేయనని చెప్పుము. పొమ్ము.

ఉద్ధ—చిత్తము.

(అని నిష్క్రమించును.)

తెర వ్రాలును.

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# రాధాకృష్ణలీల.

అను

# చంద్రముఖీగర్వభంగము.



## తృతీయాంకము.

### ప్రథమరంగము.

—! స్థలము — రాధశయనాగారము. !—

[రాధాకృష్ణులు గూర్చుండియుండఁగా తెరలేచును]

కృష్ణు — అత్తా! నీవేల నాప్రేమను గూర్చి సంశయించుచున్నావో నే నూహింపజాలకున్నాను.

ఆ. వె. ఆలివచ్చినంత । చాలప్రేముడి బెంచు
కొనినజననినైన । గననియటుల
యీఁపు వచ్చినంత । నిన్నాళ్ళనఱకున్న
నాప్రియసతుల విడ । నాడలేనె?

రాధ — నీమాయ మాటలెవ్వరు నమ్మెదరనుకొంటివి? నీకే నాయెడల నట్టియభిమాన మున్నచో నాకీయవస్థ యేమి?

ఉ. నీదువియోగమోర్వదగు । నిక్కపుశక్తియొకింత లేమి నీ
మీఁదనె దృష్టినుంచుకొని । మిక్కిలి నేడ్చుచు వాడవాడలం

"దోదర హాసచంద్రి! సుగుణోజ్జ్వల! కృష్ణ! యనుగ్రహింపుమీ
రాధ"నటంచు బోయెడితి । రంబగుదుర్గతియేల మాధవా ?

నాబ్రతుకంతటితో సరిపోయినదా? నవ్వెడివారికి నవ్వసందును దెప్పెడివారికి దెప్పసందును నైనదే. అధిమైన సంతోషముతో భరియింతునే. నన్నుఁగాంచి పరిహసించుటయా? నిందించుటయా? మీకొరకట్లు నేను దిరుగుచుండఁగా నన్నొక చెడిపెగాంచి

మత్తకోకిల.

అంశుదానవుగావటే మరి । యాదసుంతయులేదటే
వాడవాడల యుందు నిట్లుప । భర్తకై పలవించుచున్
దాడుఁ దీసెదవేమి పాతకి । తప్పుగాదటు కాంతకున్
దాఁరిడు గట్టినవాఁడు భర్తను । ధర్మమగ్నిని దోసితే.

అంతటితోనూరకున్నదా ? తానేమో మహాపతివ్రతయఁట. తన్నుమించినవారీనేడు లోకంబులయందును లేరట. ఆత్మస్తుతి పరనిందాపరాయణు రాలైన నీమెతోడిదేమని నేననుకొన్నను

ధృవకోకిల.

తనకు మించినమాటలాడకు । దైవమెట్లగు నాలమం
దలనుగాచుక గొల్లబొట్టెల । దాసుఁడై పడియుండి పే
శలము మాపును దాల్చియెప్పుడు । జారచోరుఁడు కూరుఁడై
మెలగు కృష్ణుఁడవేటిమాటలు । మిన్నకుండుము జారిణీ.

ఒకటియా? రెండా? ఎన్నియనిచెప్పఁగలను? నాకవియన్నియు జ్ఞప్తియందుండునా?

కృష్ణు—అత్తా! అన్నియు నీకు జ్ఞాపకముండక పోయినఁ బోనిమ్ము. దానిమాటలు మనమేల లెక్కింపవలయును?

రాధ—చిన్నికృష్ణా! దానిమాటలు మనమే లెక్కింపవలయునందు

వా? దానికింతటి యహంభావత్వము దగునా? అంత య
హంభావము దానికున్నప్పు డాయహంభావ మడపవలదా?
అట్లడప నుపేక్షించినచో మనకు బ్రమాదము గాదా?

కృష్ణు—మన కేమి ప్రమాదమున్నది? ఏకట్టును నిప్పున్న నాకట్టెయే
గాలునుగాదా?

రాధ—అట్లు సరిపోవునా? చుట్టుపక్కలనున్న కట్టెలన్నియు గ్రమ
ముగా రాజి మండిపోవును.

కృష్ణు—అట్లే యనుకొమ్ము. నన్నిప్పుడేమి చేయమందువు?

రాధ—ఏమి చేయమందునా? నిన్ను నిందించిన హిరణ్యాక్ష హిరణ్య
కశ్యపులను మర్దించితివి. కంసాదులం బోకార్చితివి. చాణూ
రమల్లుల సంహరించితివి. నిన్ను బరిభవింపదలంచి రాళ్లవర్ష
ము గురిపించిన నింద్రుని గోవర్ధనం బెత్తి పరిభవింపం జేసితివి.
ఇట్టివెన్నియని వచింపం గలను. నిన్నునిందించినవారికి దగినట్లు
బుద్ధిసెప్పి నీమహామహిమమును నిలువం బెట్టుకొమ్మందును.

కృష్ణు—అత్తా! దూషణభూషణ తిరస్కారంబులు దేహానా?
ఆత్మనా?

రాధ—దేహమునకే.

కృష్ణు—అట్లయిన నభిమాన మెందులకు? కంసాదులను వధించుటకుం
గలకారణం బేమియో యెఱుంగవా?

రాధ—నిన్ననవరతంబును ద్వేషించుటచేత.

కృష్ణు—రాధా! ఇంచుకాలోచించి సమాధాన మిమ్ము.

రాధ—ఇందాలోచింపవలసిన పని యేమున్నది?

క. తనువున విఱిగిన యమ్ములు
నను వున బుచ్చంగవచ్చు । నతినిష్ఠురతన్

మనమున నాటినమాటల
విను మెన్నియుపాయములను । వెడలునె యధిపా.

కృష్ణు — వెడలవు నిజమే అందుల కిప్పుడేమందువు?

రాధ — ఆమెగర్వ మడపమందును.

కృష్ణు — నన్ను ద్వేషించుటచేతనే యామెగర్వ మడపవలయునా?

రాధ — ఆహా!

కృష్ణు — రాధా! కంసాదులు లోకద్రోహులగుటచే వారిని వధించితిని గాని కేవలము నాకు ద్రోహులుగదా యని ఖండింపలేదు. ఇప్పుడాచంద్రముఖి నన్నుద్వేషించుచున్నది గానిలోకమును ద్వేషించుటలేదు. లోకమును ద్వేషించి నప్పుడు గాని యామె గర్వమడపరాదు. అందుల కాలోచించుచున్నాను.

రాధ — (విన్నదనముతో) అట్లయిన నేనీ నిందభరించుచుండవలసినదేనా? నీ యట్టివానిని వరించి యొక కొంటెమాలినదానిచే ననరాని మాటలనిపించుకొని మొండికట్టియనై పడియుండ వలసినదేనా?

కృష్ణు — (తనలో) ఈమె నీ సమయమున నించుక పరిహాసించుకొనును గాక. (పైకి) అత్తా!

క. తగదని యెఱుఁగక మమ్మా
దగిలితివి మృగాక్షి దీనఁ । దప్పగు నీకుం
దగిన మదుమేందు నొక్కని
దగులుము గుణహీనజనుల । దగునే తగులన్.

రాధ — (విచారముతో) ప్రాణేశ్వరా! ఇదివఱకే పరిభవింపఁబడితినని విచారించుచుండ మీరాదుఃఖము నినుమడింపఁ జేయుచున్నారా? ప్రాణేశ్వరా! క్షమింపుము.

* సీ. సూక్ష్మమై ప్రకృతి పూ । రుషకాలములకు నీ
శ్వరుఁడవై భవదీయ । చారుదివ్య
లలితకళాకౌశ । లమున నభిరతుఁడై
గడఁగు నీరూప మె । క్కడమహాత్మ!
సత్వాదిగుణసము । చ్చయయుక్త మూర్థాత్మ
నయిననే నెక్కడ । ననఘచరిత
కోరినమంగళ । గుణభూతిదానంబు
సేయంగబడునని । చెందుభీతి
నంబునిధిమధ్యభాగమం । దమృతఫేన
పటలపాండుర నిభమూర్తి । పన్నగేంద్ర
భోగశయ్యను బవ్వళిం । పుచును దనరు
నట్టియున్నతలీల ది । వ్యంబుదలఁప.

దేవా! నన్నేల నిష్కారణముగా జిన్నబుచ్చెదరు? మీరు పేకు వహించితిరయేని బలాత్కారముగా జచ్చుట నిక్కము.
(విచారముతో)

తే. గీ. ఈపరిభవానలము రేగి । యిట్లునన్ను
మాడ్చివేయుట సత్యమో । మహితచంద్ర
వలచి పరమేశుచెట్టను । బట్టినట్టి
రాధ కయ్యయ్యొ యెట్టి దు । ర్గతిలభించె.

కృష్ణు—(రాధ నక్కునఁజేర్చుకొని)

* చ. అలికులవేణి! నవ్వులకు । నాడినమాటల కింత సీమదిం
గలఁగఁగనేల? వేటలను । గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికినబల్కు లెగ్గులని । పట్టుదురే భవదీయచిత్తముం
దెలియఁగఁగోరియే బలికి । తిన్ మదిలోనిటు గుందనేటికిన్.

అత్తా! ఈ నా భావమెఱుంగక నీ విట్లు చింతించుట బాడియా?

నీపై నాకున్న యభిమానమెఱుఁగవా? నేను నిన్నాదరించు చందం బెఱుఁగవా ? అట్లెఱింగియు నన్ను వ్యథాదలంచుట నీకు యుక్తమా?

ఉ. నిన్ననరాని మాటలని । నిందమొనర్చినదాని గర్వమే
నెన్నటికేని ద్రుంపక స । హించెద నంచెద నెంచికొంటివే
పన్నగవేణి! చంద్రముఖి । వచ్చినినుఁ శరణంబువేడి ని
న్నెన్నియొయంటి దానిఫల । మిద్దికుమింపు మనంగఁజేసెదన్.

రాధ—శేషశయనా! దానికెంతకాలవిలంబము గావలయును?

కృష్ణు—అత్తా! అక్రూరుఁడు పాండవులచెంతనుండి నేటిరేపట వచ్చును. చంద్రముఖి పుట్టింటికిఁ బ్రయాణోన్ముఖురాలయి యున్నది. ఆమె సకుటుంబముగా సుమ్ముఁదిగుచుండ నక్రూరుఁ డెదురగును. ఒంటిమనుజుఁ డెదురయ్యెనను రోషంబున నాతనినిందించును. అతఁడు పరమభక్తాగ్రేసరుఁడు గాన భక్తనిందయు నొనర్చును. ఆయవకాశము గొని యామెగర్వపరిహార మొనర్తును. ఈస్వల్పకాల మోరిమివహింపుము.

రాధ—అప్పుడైన నాయాశాలత ఫలించునా?

కృష్ణు—అత్తా! నీ మేనల్లునియందు నీ కీసందియమేల?

తే. గీ. తివిరిభక్తుల నెల్ల వే । ధించువారి
నిష్టమైనట్లు లోకంబు । లేచువారి
నెంచిద్విజులను మునుల నిం । దించువారి
నెన్నటికి నేను క్షమియింప । నిదినిజంబు.

కావున నాయందనుగ్రహముంచి యింక నేని ప్రసన్నవుగమ్ము.

రాధ—దేవా! లీలామానుషవిగ్రహా ! నా యవివేకమునకు క్షమించి యుద్యానవనములోనికిఁ బోదముర‌మ్ము.

(అని యిరువురును నిష్క్రమింతురు.)

ద్వితీయ రంగము.

స్థలము:—రాజబాట.

[మ్లానవదనుఁడై యక్రూరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అక్రూ—(తనలో) ఆహా! ఎంతదుర్దశసంప్రాప్తించినది.

మ. కులమర్యాదనశించె, స్త్రీపురుషసం । కోచంబు వమ్మయ్యె, పె
ద్దలపై భక్తి తొలంగ, భక్తుగని నిం । దల్సేయు టెచ్చయ్యె, ప్ర
శ్నలు మెండయ్యెను దైవభీతి లవలే । శంబైన లేదయ్యె దు
ష్కలికాలంపుమహాత్మ్యమీయుగమునన్. । గన్పట్టెడిన్ జోద్యమై.

ఆహాహా! చంద్రముఖి కెంతగర్వమున్నది. తానేమో పుట్టినింటికి వెడలుచుండఁగా నేనెదురు వచ్చితినని నన్నెంతెంత లాడిపోయెను. నాదైవము నెన్నిగతుల నిందించిపోయెను. ఆమె యెంతగర్వోన్మత్తురాలై యుండెను? దీనికింతగర్వమా? ఈమె పతివ్రతామణియైనసరేఁగాక. ఇంతభగవద్విరోధమెందులకు? భక్తద్వేషమును, భుక్తిద్వేషమును గల్గిన వారాలోకప్రయాణమునకు సంసిద్ధలైయుండవలసినదే గదా? నే వేవేగఁజని పాండవవాక్యంబులాశ్రీకృష్ణభగవానున కెఱింగించి యీపైన చంద్రముఖి దురాలాపంబు లాతనికి వినిపించెదఁగాక ఓభక్తజనమందారా! నిన్ను నమ్మినవాని కేకొఱంత.

*ఉ. కొందఱు యోగదృష్టినొక । కొందఱు వేదవిచారవాసనం
గందుఱు నిన్ను నెప్పుడోయొ । కానొకవేళ నభిజ్ఞులైన వా
రందఱు నిట్టినీవు కరు । ణాంబుధి! ప్రాకృతదృష్టిఁజెందు నా
ముందట నిల్చియెన్నఁడుప్ర । మోదమొనర్తువు నందనందనా?

*ఉ. విశ్వములీలఁద్రిప్పుచు న । విద్యకుఁ జుట్టమువైననీకుఁ దా
శాశ్వతమైన కాలమిది । సర్వము వేడబమందురట్టి వి

శ్వేశ్వర మేలుకుష్ప నిను। నెవ్వఁడు గోరిభజించు వాఁడెపో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ। సౌఖ్యయుతుండభయుండుమాధవా!
నేను లోనికరిగి శ్రీకృష్ణుని దర్శించెదఁగాక. (అనినిష్క్రమించును)
[ తెర లేచును]
[కృష్ణుఁడు కూర్చుండియుండును. అక్రూరుఁడు నిలువంబడియుండును]
కృష్ణు — అక్రూరా ! ఏమంటివి?
అక్రూ—దేవా ! నేను నేఁజేసికొనిన పారిబ్ధవిశేషంబున నాచంద్ర ముఖ గుమ్మము దిగుచుండఁగా నేనదుకైతిని. అదియామె క మంగళమఁట. వెంటనే నవమాష్టపారాయణ బ్రారంభించినది.
"కం. నేరుపుమై క్రూరుండను
పేరే నీపితలు నీకుఁ। బెట్టిరి నీకా
పేరు రుచింపమిచే య
క్రూరుండని యిట్లు దిద్ది। కొంటివి నిచా!
చం. ఖలమతి పుట్టినింటికిరు। గన్ దలపోసిగృహంబువీడి ని
శ్చలముగ గుమ్మముఁ దిగెడి। సంగతి నిప్పుగ్రహింపబోక ని
వలతిగి నాకునిప్పుడెదు। రైతివి నిందునసేమి కీడు వా
టిలినను నేదిదిక్కు ? తల। డెక్కిన పాపములేదుదుర్మతీ !
జడమతీ ! ఎవ్వరెట్టిమహాత్కార్యముల మనమునందుంచుకొని గుమ్మముదిగుదురో కనిపెట్టవలదా ? దృష్టిపిడతవోలె చటాలున నెదురౌటయా? వారికార్యమంతటికిని భస్మముగావలసిన దేనా ? ఇట్టిదుశ్శకునమే నీకైన నెట్లుండునో నీవు గ్రహింపలేవా బాలిశాధమా ! భక్తాగ్రేసరుఁడనని పట్టివర్ధనములు మాత్రము దిద్దితివా ? నీభక్తిపాడుగాను. జగదేకారాధ్యుండగు శ్రీమన్నారాయణుని గొలువరాదా ? గోపికారాధ్యుండగు గొల్లవానిని గొల్తువేమి పాపము ? నీకు మతిలేదా ?

కం. సతతము శంకరుఁగొల్చిన
గతిగలుగునుగాని గొల్ల । కాంతలకొఱకై
మతిలేక దిరుగునాడు
శ్రుతిసేవించిన సుగితము । అయునననలతే.

ఛీఛీ! నాఁబోటి మహాపతివ్రత లిట్టిగాఁ ప్రియులందుండరాదు. మత్తుమందుజల్లిన ట్లుండఁడా క చేవిధము. హాహో పాపాత్మా! ఇంకను నిలిచితివేమి? తోటయందు నాకాపదలురావలయునని గోరుచుంటివా! నేను మహాపతివ్రతనని యెఱుఁగవా? ఆపదలునన్నంటవని యెఱుంగవా? దిక్కుమాలిన దుష్టకునమై నంతమాత్రమున నాకు వచ్చిన బ్రమాదము లేదు. నీబ్రతుకు తగ్గులంబడ. నేనుతలఁచుకొంటినేని నిన్నును, నీశ్రీకృష్ణుని గూడ మూఁడు చెఱుపుల నీళ్లుత్రాగింపఁగలను. ఈయూరనందఱును వ్యభిచారిణులే. అందఱును దొంగభక్తులే" అనియింకనెన్నెన్నియో దిట్టి యంతతో నూరకొనక తానుస్త్రీనను మాటయే మఱచి పోయి పురుషుఁడనగునన్నుఁగొట్టవచ్చినది. నేనామెను గాంచి నిర్విణ్ణుఁడనైపోయి కొట్టవచ్చుటచే యింక తప్పుకొంటిని. తప్పుకొనినను నామెకు సంకోచముగలుగలేదు. పురుషునిగొట్టగలనా యను ధైర్యము లేదే? తప్పుకొనిన నన్ను త్రాళ్లతో గొట్టినది.

సీ. గొల్లవానిని భక్తి । గొల్చుటమానవే
రా యటంచని యొక । రాయిఱువ్వె
యేనాఁడు నెవ్వరి । కెదురు రాకుండు
వా యని యొకరాయి । బలిమివిసరె
పట్టివర్ధనమేల । పాపుఁడా యని "తుబు
క్కునమ్మి" రాయిచే । గొట్టెమరల

మగవాడనైయుండి । మగిడెద వేలరా
　　　　తులవాయని రాయి । తోడగొట్టె
నోటవచియింపరానట్టి । మాటలనుచు
పిచ్చియెత్తినట్లన తల । విరియబోసి
రాలుఱువ్వేను నెన్నాడి । చాలవఱకు
కాంతగాదది ఘోరరా । కాసిగాని.

తుట్టతుద కెట్లో యామెను దప్పించుకొని మారుమార్గంబున మిమ్ము దర్శింపవచ్చితిని. దేవా! దానియాగడ మడపకున్న చిలికిచిలికి గాలివానయైనట్లు క్రమక్రమముగా లోకములెల్ల నేచునను కొందును.

కృష్ణ—భక్తాగ్రేసరా! విచారింపకుము. ఆమెగర్వాపహ్రియశ్చిత్తమొన ర్చెదను. ఇదిగో! నీవొకపక్షముదినములు బోయినపిమ్మట చంద్రముఖి తండ్రియగు పుంగవుని గృహంబునకు రాధను దోడ్కొనిరమ్ము. అచ్చటచంద్రముఖిచే మీకుక్షమాపణము జెప్పించెదను. చంద్రముఖి ప్రాయాణమాపినదా ? పుట్టింటికి వెడలినదా ?

అక్రూ—వెడలినది.

కృష్ణ—ఆమె భర్తయగు వేదపుండో.

అక్రూ—ఆమెను కొంతవఱకు సాగనంపి వెనుకకు వచ్చివైచును.

కృష్ణ—అట్లయిన మరియుమేలయ్యె. నీవింకబొమ్ము.

అక్రూ—శ్లో. మురళినినదలోలం ముగ్ధమాయూరచూడం
　　　　దళితదనుజజాలం ధన్యసౌజన్యలీలం
　　　　పరహితనవహేలం పద్మసద్మానుకూలం
　　　　నవజల ధరనీలం నేమిగోపాలబాలం॥

నెలవాఁ్రిలును.



తృతీయ రంగము.

స్థలము:— బాటమధ్య.

[చంద్రముఖి, గోపబాలుఁడు, మాలిని నడచుచుండఁగాఁ దెర తీయును.]

చంద్ర— మాలినీ! మన్మనోహరుఁడు మనలను విడచి వెనుకను వెడలి నప్పటినుండియు నామనంబే కారణముననో గాని కళవళపడుచు న్నది. కాని కారణమిదియని యూహింపఁజాలకున్నాను.

కం. గడపదిగీదిగకుండగ
నడివడి నకూరుఁడెదురు । వచ్చుటచేతన్
బొడమిన దుశ్శకునఫలం
బుడుగునె యేనాఁటికైన । నూరకమనలన్.

మాలి— అమ్మా! నీవు మహాపతివ్రతవు. పతివ్రతను భగవంతుఁడే బాధింపలేనప్పుడు పాడుశకునంబు లేమి చేయంగలవు?

చంద్ర— నెచ్చెలీ!

తే. గీ. శకునమనునది భావిసూ । చనముసుమ్ము
కర్మసూత్ర ప్రకారంబు । గా శకునము
లొదవుచుండును వానిచే । బొదుమబడక
దాటుటది దేవదేవుని । తరముగాను.

మాలి— దేవదేవునకు వశముగాకపోయిన పోవచ్చును. ఆదేవదేవుఁడు పతివ్రతలకు దాసుఁడంటివిగదా? నీవు మహాపతివ్రతవు గావున దేవదేవునికంటె నెక్కుడుదానవు గనుక నిన్నాశకునము లేమి చేయంగలవు?

చంద్ర— మాలినీ! ఆదేవదేవుఁడు పతివ్రతకు దాసుఁడేగాని— కర్మ సూత్రము మాత్రము బతివ్రతకు లొంగదు.

గోప—చకునమంటూ వూ సెట్టుకొని నడకమానేశారు. సేనాదూర మెల్లాలి. నడండి.

చంద్రి .. మాలినీ ! నాహృదయమునం దేమియు స్థిమితముగా లేదు. నాప్రాణేశ్వరుఁ డీపాటికి గృహంబున కరగియుండును. మనము గూడ వెనుకకు బోదము. గోపకుమారా! సందియింపక తిరుగుము. (అని వెనుదిరుగును.)

[అప్పుడు కృష్ణుఁడు వేదవ్రుని రూపముతో బ్రవేశించును.]

కృష్ణు — ఇప్పుడీ విచిత్రనాటకమునకు బ్రస్తావన ప్రారంభింపవలయును. ఈమె తిరిగి రేపల్లె వచ్చినచో నాప్రయత్నము నెఱవేరదు. కావున నేనే యామెభర్తయగు వేదవ్రుని యట్ల నటించి యీమెను వ్రుట్టింటికి దోడ్కొనిపోయెదగాక. ఈమెపతివోలె నే నేనును నిరక్షరకుక్షివోలెనే ప్రస్తుతము మాట్లాడెదగాక. (అని నడచును.)

గోప —(ముందుకుచూచి) ఎందమ్మా ! వేదయ్య మల్లొత్తుండాడు. సూడు. సూడు. ఇంటికాడేం గలిభీయెందోయేంటో?

చంద్రి— ఇంటియొద్ద గలిభీయగుటకేమున్నది? నాప్రాణేశ్వరుని విడచివెడలుటకు నాకెట్టి యాటంకమున్నదంటివో, నన్నువిడచి యుండుటకు నా ప్రాణేశ్వరునకు నట్టి కారణమే యుండి యుండును.

[అప్పుడు మాయావేదవ్రుఁడు సమీపించును.]

మా-వే—(ఆయాసమభినయించుచు) ఓలిసిందిరీ ! మనంకట్టుకున్నేల యెల్లాంటివో గాని నిన్నిడిసి యింటికాడుండలేక సక్కొచ్చినా నే.

చంద్రి— అట్లయిన నాతోకూడ రాలేకపోయితిరా ? మఱల వెనుక కేల వెడలితిరి?

**మా-వే.—** పెళ్లాన్ని డిసి పదిరోజులుండతేనానిన్నీ—మనమోరు లేకుంటే పశుధనాలగతేంటనిన్నీ—ఆలోసించి యెనక్కి పోయాను. నువ్వు కనపడకుండా నున్న ఒక్కగడియ సీకటందకారమై పోయింది. మరేంసేసేది? కూడుతిందామంటే ఆపోలేదు. పసువ్రులని సూగ్గారంటే బుద్దేపుట్టనేదు. ఇల్లయోమయపోయింది. ఇదేంటి యెదవబాదని వైరందెచ్చుకోని పశుధనాలకిగంటే కూలోణ్ణిప్పగించి, ఆమణ్ణితెగిసి యెకాయెకిని సక్కావొచ్చి యిప్పటికి గంటే మీలో పడ్డాను. ఐతే ఒలే ! తెలకడుగుతాను. పిలందే ఒళ్ళనని మీయయ్య నన్ను సూసి కోంపడుముగందా?

చంద్రి— ప్రాణేశ్వరా ! ఎన్నఁడులేనిదిట్లాడుచుంటిరేమి ? హాస్యమాడుచుంటిరా? నిజమాడుచుంటిరా ?

**మా-వే.—** ఎన్నఁడూలేని మాటలేంటి? మీయయ్య మంచోఁడేంటి? ఆణ్ణెరగనా? మాటిమ్మని రమ్మంటే మీరంతావోళ్ళరు నేకూట్టగలనా ? పొండంటేయేమనేది? మీసెల్లెలు పెళ్లికగంటే బోయినాలకి పిలనోళ్ళొళ్ళరసి పొమ్మన్నాఁడుగాడంటే. అల్లాగ అల్లుణ్ణోణ్ణి పొమ్మంటే నాగేంటిసెప్పు. ఇప్పు డుసూరుమంటూ యెనక్కిరానా ?

చంద్రి— ప్రాణేశ్వరా ! ఎంతమాటంటిరి.

తే. గీ. వేనవేలకు భోజనాల్ । బెట్టలేక
పొమ్మనెనుగాని మిమ్మేల । పొమ్మనియను
పిసుగు బడ్డప్పు బిక్షుకై । వెడలునప్పు
చదువు నుంత్రిమొక్కటగునే । స్వామి చెపుమ.

**మా-వే.—** మీబాబుమీద సీకబిమానం గినకల్లా గంటావుగాని తీరా పొమ్మంటే నేనేంజేసేది?

**చంద్రి—** ఆ భయము మీకగత్యము లేదు.

మా-వే — పోనీ ముందీసిన్నయ్యను బంపుదాఽ.

చంద్రి - ఎందులకు ?

మా-వే — మనవొత్తున్నామని యింటికాడసెపితేఆళ్లుకూడొండిసెడతారు. అసలుసంగతేంటంటే మీఅయ్యమూలిగితే తిరిగొస్సిమనకిసెపుతాడు. యిక్కణ్ణుంచే యెనక్కెళ్లవచ్చు.

చంద్రి మీరుపట్టినపట్టు మీరు విడువరు. అట్లే పంపించుడు.

మా-వే - గోపన్నా ! ఎల్తావా ?

గోప - ఎల్లమంటే యెల్తాను. మీమామకోప్పడితే తిరిగొస్సి సెబుతాను.

మా-వే — ఎల్లు. బేగెల్లు.

(గోపన్న నిష్క్రమించును.)

తెలవారెలును.

ఇది తృతీయాంకము.





శ్రీ

# రాధాకృష్ణలీల

అను

# చంద్రముఖీగర్వభంగము.



తురీయాంకము.



ప్రథమరంగము.

—॥ స్థలము:— పుంగవుని యింటిముందరిభాగము ॥—

[మాయావేదపుని రూపమున కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కృష్ణు—(తనలో)

తే. గీ. తనవఱకు రాకయున్నంత । దనుక నరుఁడుఁ
బూని శ్రీరంగ నీతులె । న్నని నుడువు
దనవఱకు వచ్చినప్పుడం । తయును మఱచి
"పప్పులోన నడుగువైచు" । తప్పకుండ.

ఈచంద్రముఖి చారిత్రి మింపులకు నిదర్శనమై యున్నది. వెనుక బృంద తనభర్తయగు జాలంధరరూపమున వచ్చినశ్రీమహావిష్ణు నిఁ గౌఁగిలించుకొనినదనియు నందుచే నామె పతివ్రతగాదని యు జెప్పినదే. తానుగూడ నిప్పుడట్టి మోసముననే దిపులు కొన్నదే. ఇప్పుడు తనవివేకమేమైనదో? నామాయారూపము

నుగాంచి నిజము గ్రహింపకనే నే దనపతిననుకొని నాసేవఁగా వరించుచున్నది. కానిమ్ము. పుంగవునకుఁ గృత్రిమజామాతనగు నామీఁదననిమిత్తాగ్రహంబు దెప్పించి నీజనకుఁడు నన్ను నిందించెగాన నీవు నీపుట్టింట నున్నంతకాలమును నీతో గవయనని జెప్పి యామె నంటకుండ దూరమునం దుంచితినిగదా? ఇంక నీపై నా విచిత్రనాటకము ప్రయోగించి యీమె గర్వభంగ మొనరింపవలయును. నీజనకుఁడు నన్నగౌరవ మొనర్చుచుండెనను నెపంబున నీమెను బయలుదేఱదీసి నాతంత్రముపయోగింపవలయును.........

సీ. పతినాజ్ఞలోఁ బెట్ట । భావించు టొక్కటి
ధవునిపై బెట్టల్క । దాల్చుటొకటి
యదిజేసి తిది చేసి । తనిపోరుటొక్కటి
తననాథు హితవెంచ । కునికియొకటి
అత్తమామలభక్తి । నరయమియొక్కటి
కన్నుమిన్నుగనని । గర్వమొకటి
అతిథియభ్యాగతి । నాదరింపమియొక్క
టనయంబు పరుషోక్తు । లాడుటొకటి
మగనియాజ్ఞల నెల్ల । మన్నింపమియొకటి
దైవంబుపై భక్తి । తలగుటొకటి
పరనిందఁ జేయగాఁ । బరగుటయొక్కటి
తనుదానె స్తుతియించు । కొనుటయొకటి
పతియెదైవంబని । భావింపమియొకటి
పెద్దలపైభక్తి । విడచుటొకటి
తనకులాచారముల్ । దగవీడుటొక్కటి
విపులసత్యంబును । విడుచుటొకటి

యనెడిపదునాలు చెడుగుణా । లరసివిడచి
ఘనపతివ్రతయైగాని । కాంత యొక నె
సత్సతీమణీబిరుదంబు । జగతి బడయు
నట్టిరుల కెప్డుదాసుఁడ । నగుదునేను.

పైపదునాలుదుర్గుణంబులలో నేగుణ మామె చెంతనున్నను నేనామెకు దాసుఁడనుగాను. ఇప్పుడీ చంద్రముఖి పతివ్రతయే గాని-సత్సతీమణికాను గర్వము-ఆగర్వము దలకెక్కుటచే నెల్లరపరుషోక్తులాడుట-పరనింద జేయుట-తన్నుదా పొగడుకొనుట-దైవభక్తి విడుచుట-పతియె దైవమని భావింపకుండుట-మొదలగుదుర్గుణంబులచే గట్టుబడియుండుటచే నీమెగర్వమడంచి, యీమె యీదుర్గుణంబులనుండి వెల్వడి తరించునట్లొనర్పవలయును. (ముందునకుజూచి) అదిగో! పుంగవుండరుదెంచుచున్నాఁడు. మాప్రియాంగనకీతసనుమతింపఁజేసి యాపైన నాచితప్రయోగము జేయవలయును.

[అప్పుడు పుంగవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పుంగ—(తనలో) అల్లుకోడొచ్చి నెల్లాళ్లైంది. ఏళతప్పకుండా కూటికి కూకుంటాడు. ఏదేనా పనిసెయ్యమంటె మిడుకుతాడు. "తిండికి తిమ్మరాజు, పనికిపోతిరాజు"అన్నావన్నాలంటు సెందరమ్మ డుత్తుంది. ఆళ్లనలుగురికి పెట్టలేక నేనేడుత్తున్నాను. ఈడి జిమ్మడ పోతానని మాటవరుసకైనా అనఁడే పాపము. ఈడి యాలనకపోతే ఆకూంతనూటా నేసేలంటాను. (ముందుకు చూచి) ఇడిగో! ఇక్కడుండేంటో ఆలోసిత్తుండాడు. సంగతేంటో కనుక్కుంటా(అని సమీపించి) ఏంటాలోసిత్తున్నావు యేదన్నా!

**మా. వే**—ఆలోసనేముంది? ఇప్పుడే కూడుతినిల్లాగొశ్శా.

పుంగ—మీవూరెళ్ళేదాని కాలోసిత్తున్నావేమో అనుకుంటున్నాను లే.

మా-వే—ఎల్తాను. తొందరేం.

పుంగ—తొందరకాదేంటి? పశుదనాలని సూసుకోకబో తేనట్టారాదు.

మా-వే—కూలోడున్నాడు బయంనేదు.

పుంగ—కూలోడు యజమానిలా పనిసేత్తాడా?

మా-వే—కూలికావలసినోడు సెయ్యకేంజేత్తాడు.

పుంగ—ఆడికూలెక్కడికిపోతది. మాసెందరమ్మ యెల్లాలంటూందిలే.

మా-వే—రేపెల్తానులే. అల్లా అనుకున్నాము.

పుంగ—రేపే.

మా-వే—ఔ.

పుంగ—ఎల్లదలుసుకున్నోళ్లుంటగా రేంటి? ఎల్లండి.

(నిష్క్రమించును.)

మా-వే—అన్నియు ననుకూలముగానున్నవి. ఇంక చంద్రముఖిని బ్రియాణమొనర్చి యీప్రయాణములోననే నీమె గర్వభంజన మొనర్పవలయును. (తెరవైపుజూచి) మాలీ!

మాలి—(ప్రవేశించి) ఏమి?

మా-వే—రేపు పొద్దుటేల లెగిసి మనవూరికెల్లిపోదారని మాసెందిరితో సెప్పు. ఆళ్ళయ్య ఒప్పుకున్నాడనికూడ సెప్పు.

మాలి—చిత్తము.

(అని నిష్క్రమించును.)

తెరవాలును.

## ద్వితీయ రంగము.

స్థలము: పుంగవుని యింటియుంగలి భాగము.

[చంద్రముఖి నిలువబడియుండఁగాఁ దెర లేచును.]

చంద్రి (తనలో) నేఁడు ప్రియాణనుని తెల్పిన నామనోహరుఁ డింకను భోజనమునకే రాలే దెక్కడకుబోయెను జెప్పుమా?

(అని యాలోచించుచుండెను.)

[అప్పుడు 1 వ మాయామాయవేదప్రుడు ప్రవేశించును.]

మా-వే - ఎం దే-నిలబడ్డావు. బేగి కూడెట్టు.

చంద్రి — నాథా! మీకొఱకే చూచుచున్నాను. రండు. (అని లోనికి దీసికొనిబోవును.)

• [2 వ మాయామాయవేదప్రుడు ప్రవేశించును]

2. మా-వే —(తనలో)

శా. ఈమాయన్ గనిపెట్టనెంచి మదిలో। నెంతేని తబ్బిబ్బుతో
నేమాత్రింబును నెంచలేక మదినెం। తే జింతకున్నక్క యో
స్వామీ! నీమహిమాంబురాశిమతి నే। ఫక్కన్ గనుంగొందు న
న్నోమన్ రావె దయానిధీయనుచు నో। హో వేడెదిన్ దీనతన్.

(ప్రకాశముగా) సొదిరీ! లో నేం జేత్తున్నావే.

[తెరలో] ఎవరువారు?

2. మా-వే—ఎనగేంటి మరిచ్చిమొగవా? నేను. తలుపుతియ్యి. బేగిరా.

చంద్రి—(ప్రవేశించిచూచి నిర్ఘాంతపోయితనలో ) ఏమిది? నాకన్నులను నేను నమ్మవచ్చునా? నాప్రాణేశ్వరుఁ డాహారించుటకై వంటశాలలోనికిప్పుడే వెడలి యింతలోననే భోజనమైనఁ జేయక బయటికేల వెడలెను జెప్పుమా?

2. మా-వే — ఎందే. అల్లాగాలోసిత్తావు. నీవ్వగేంటి?

చంద్రి — ప్రాణేశ్వరా! మీరాహారము దీసికొనుటకై లోనికి వెడలితి రిగదా? మరల బయటకెప్పు డెందులకు వెడలితిరి.

2 మా-వే— ను వ్వెవరినిసూసి నన్ననుకొన్నావో గాని నేనిప్పుడే గావచ్చింది.

చంద్రి—(తనలో) ఇప్పుడే ధైర్యమూనవలయును. (పైకి) పాదప్రక్షాళనమునకు జలముదెచ్చెద. (అని వెడలి జలకలశముతో బ్రవేశించి తనలో) ఈతఁడు నిశ్చయముగా నాపతియే. నా జనకునిచే బరిభవింపబడిరి గావున నన్ను బరిభవింపనెంచి యుండెను. మహాపతివ్రతనగు నేనీ స్వల్పాపాశయమునే గని పెట్టలేకుందునా? నేనును నేమియు నెఱుంగ నట్లే నటించెదను. ప్రాణేశ్వరా!

ఆ. వె. భర్తవౌట నిన్ను । బరిహాసమాడితి
దానికిట్టులాడఁ । దగునె మీకు
పరునిజూచినంత । పతియని యెంచఁగా
మతియు సుతియులేని । మగువనొక్కొ.

2. మా-వే— నేనూ చరచమాడాననుకో. మాసెడ్డాక లేత్తోంది కూడెయ్యే.

చంద్రి—లోనికిరండు. (అని తీసికొనిపోవును.)

[3 వ మాయావేదపుఁడు ప్రవేశించి]

3 మా-వే —(తలుపుఁబుత్తుటుచు) తలుపు తలుపు.

[తెరలో]

ఎవరువారు? ఇప్పుడు తీయుటకు వీలులేదు.

3. మా-వే—సచ్చినేనొత్తే యేరంటావెందే. పుట్టింటికొళ్ళి నన్నేమరిసిపోనావంటే నీ సిగదరగ, రాయే. తలుపుదియ్యే. ఆయా చంగావుంది.

చంద్రి—(ఈవలకువచ్చి చూచి నిర్ఘాంతపడి) ఏమిది?

3 మా-వే—ఏంటే. (అని సమీపించి భుజముపైఁ జేయివైచును.)

చంద్రి—(తనలో) రూపయౌవనములందుగాని- వేషభాషలయందుగాని యించుకేనియు భేదములేక నామనోహరునివోలెనే గన్పట్టెడిని. అట్లయిన లో నను్నవారి మాటయేమి?

[ తెరలో ]

సౌందరీ! కూర్చొంటి పెత్తినాలకెల్లాయుంటె!

3 మా-వే—లో నెవ్వతే పిలుత్తుండారు?

[ తెరలో ] ఓలెందే రావు ?

చంద్రి—ప్రాణేశ్వరా! లోన మీ మామగారు భుజించుచున్నారు. ఇప్పుడే వచ్చెద నిందుండుఁడు. (అని రెండడుగులు వైచి తనలో) ఓపరమేశ్వరా! ఇదియేమిపాపము!

మ. పతిగాడంచు నెటాడజాలుదును నీ । పాపిష్ఠి నక్తింబుతో
పతియేయౌననుకొందమన్న, గదిలో । వాడెవ్వఁడైయుండు? సం
గతి సందర్భమదేమొ నాకు తెలియం। గారాదె? యెవ్వాఁడిక-నా
మతినూహించి గ్రహింతునాపతిని। యీమాయనన్ జాలుదున్.

కానిమ్మిది యేదియో యద్భుతంబుగానున్నది. లోనికరిగి చూచి వచ్చెదఁగాక. (అని నిష్క్రమించును.)

3. మా-వే— ఇప్పుడిప్పుడే మెకు బరమేశ్వరుఁ డగుపించుచున్నాఁడు. ఆహా! ఈ ప్రపంచమెంతమాధుర్యంబుతో నిండియున్నది.

తే. గీ. తమకుగల్గెడి సర్వసౌ । ఖ్యములు తమదు
ప్రజ్ఞచేగల్గెనని గర్వ । పడుదు రెలమి
కష్టమొదవంగ దైవమో । గంబటంచు్రి
కనుగొనంగ ప్రస్తుతమిది । కాలమహిమ.

(చూచి) అదిగో! చంద్రముఖి వచ్చుచున్నది. (పైకి) ఎందే. నన్నీడ కూలేసి నువ్వెల్లిపోనావు.

చంద్ర—(ప్రవేశించి) ప్రస్తుతమాతని నొకచో దాఁచవచ్చితినిగదా? ఈతనిలో నాథ ర్తరూపముననున్న వారిలోన ముగ్వురున్నట్లు గదా? కాని మ్మేమిజరుగునో జూచెదగాక. (పైకి) ప్రాణేశ్వ రా! లోనికి రండు.

3 మా-వే—అప్పుడనగా వొచ్చినో ణ్ణిప్పటికీలందాలొనకు రమ్మన డానికి. మఱిపద. (ఇరువురు నిష్క్రమింతురు.)

[4 వ మాయా వేదపుడు ప్రవేశించును]

4. మా-వే—(తలుపులుదట్టుచు) ఎందేవ్వూసాడవు. పుట్టకొక్కునా గ పుట్టింటికిసేరి మొగుణ్ణి మరిసిపోయినావంటే మొద్దా! [తెరలో] ఎవరది?

4 మా-వే—పెళ్లోన్ని పుట్టింటికిపంపినయెఱ్ఱియేదన్నని. పలకవెందే పాడుముండా!

చంద్ర—(ప్రవేశించి తనలో) ఓయిశంకరా! కానిరోజులు సంభవిం చినవి. ఇంక నాసతీత్వము జల్లారినట్లె. ఇప్పటికింటిలో ముగ్వ రొకరికి తెలియకుండ నొకరుండిరి. వీధిలో నాల్గవవాఁడు సిద్ధ మయ్యెను. ఈవార్త విన్నచో లోకులు నవ్వాడిపోయరా? ప్రజలాడిపోయు టటుంచినను నీ నల్వురిలొనను నాపతిని నే గన్పెట్టుటెట్లు?

8 వ అనుబంధము.

తే. గీ. పరులదూషించియున్నట్టి । పాపఫలము
ఉరక నకూర్రునిందించి । యున్నఫలము
ఆముకుందుని చెడదిట్టి । నట్టిఫలము
కట్టికుడుపుచునుండె ని । క్కరణి నకట.

అదిగో మఱల పొరబాటుబడుచున్నాను. పాపులను నిందించుట పాతకముగాదు. ముకుందుఁడు దేవదేవుఁడుగాఁడు. కృష్ణుఁడే దేవదేవుఁడైనచో దన్నునిందించిన నన్నింతకాల మిట్లుండనిచ్చునా? (ఆలోచించి) ఆఁ! నానాథుఁ డొకనాఁడొక కలవచ్చినదనియు, నందొకజడదారి గాన్పించి నీయభీష్టమెట్లున్న నట్లగుచుండున ని వరంబొసంగెననియు జెప్పియున్నాఁడుగదా? నామనోవృత్తి యెట్లున్నదో గనుంగొనుటకై నాపతియే యిట్టిమాఱువేషంబుల నన్నలయించుచున్నాఁడు. అమ్మయ్యా! నేను మహాపతివ్రతను గావున నీరహస్య మిప్పటికైనఁ గనిపెట్టగల్గితిని గాని లేనిచో నభాసుగావలసినదేగదా? ఈతని కపటనాటకమున కనుగుణ్యముగా నేనునుఁ గపటతాళమువైచెదను. ఆతడనంతరం బేమిజరుగునో చూచెదఁగాక.

4 మా-వే—ఓలెందే. దెయ్యంపెట్టేదానిగల్లా సూత్తావేమే. ఒండుకొనితినలేక కూటికిమొగమాచి నేనొత్తే-కూకోమనడం-దాగమియ్యడం-కూడెట్టడం-కుచలపిచ్చలడగడం పోయిందే. మిఱుతు మిడుతూ గుడ్లెట్టుకు సూత్తున్నావా? పుట్టింటికొళ్ళాక కాబుద్ధి మారిందేంటి?

చంద్రి—జీవితేశ్వరా? ఎంతమాటంటిరి. నేనట్లు మిడుతు మిడుతు చూచుటకు కారణమేమంటిరా?

తే. గీ. వంటజేసుక తినుటకు । బద్ధకించి
యున్నచో దిని లేకున్న । నూరకుండి
వాడివత్తిరైయున్న మీ । వరుసఁగాంచ
నొడలు కంపించి మాటరా । కుండె నాథ.

4 మా-వే—'దయగలమొగుఁడు తలుపు దగ్గిరేసి నురికొట్టాడంట' యిల్లాంటిదే. సచ్చినేనొత్తే నువ్వొగుత్తున్నావా?

చంద్రి—నాథా! లోనికిరండు. (అని తీసికొనిపోవును)

[5 వ మాయావేదప్రుడు ప్రవేశించును.]

5 వ మా-వే—తనదోషము దాగ్రహించియు నాతలోననే మఱల వెనుకటిపుంతలోబడి గర్వించుచున్నది. కానిమ్ము. దీనికిబూర్తిగా శృంగభంగ మొనర్చినగాని బుద్ధిరాదు. (ఆయాస మభినయించుచు) సుందరీ! ఎందున్నావే?

చంద్రి—(ప్రవేశించి చూచి) ఎంతమాత్రి మనుమానము లేదు. నా నాథుడే యిన్ని వేషములు వేయుచున్నాడు. ఈతని యభిమత మేమియో తెలియుదనుక నేనేమియు నెఱుంగనట్లే నటియించెద. ఆపై చిత్రమేమియో గనుంగొనెద. (పైకి) నాథా! లోనికి దయచేయుడు.

5 మా-వే—ఓసి నీయొట్టిగూల. పుట్టింటికాడ పప్పు బువ్వ తింటూ కూసుండావెందే. యింటికాడెల్లాగుందో - సంసారమేమైందో చూసుకోనక్కఱలేదంటే దెప్పముండా. నీకొక్కమారు పాయశ్చిత్తంసెయ్యాల. అప్పుడుగాని నీకు బుద్ధిరాదు. నువ్వెంతో మంసిదానవనుకున్నాను. ఈడవోర్నో మరిగి నామాటే మరిసిపొయ్యావు. పెద్దోళ్లు సెప్పిందూరికేపోద్దా?

కం. ఎంతోటిబలమదున్నను
కాంతను తన పుట్టినింటి । కాడనెయుంపక
కాంతాపడుసుకు బ్రతుకని
సంతసమున మగడెబంప । జాలినయట్లో.

చంద్రి— హర హర! ఎంతమాటంటిరి? తొలుతనుండియు జూచుచు నాగుణమింకను గనిపెట్టరైతిరిగదా? మీకిట్టియనుమానమేల? మీచిత్తమువచ్చిన పరీక్షచేయుడు. నాసతీత్వము నిల్చియు

న్నటుల మీకు దృష్టాంతము జూపి యశోవంతురాలను కీర్తి గడించెదను.

5 మా-వే— సీతామ్మవారి లాగగ్గిలో బడతా నంటావేమో ? నా కెందుకా సిక్కు. నీకెందుకీబాధ. నాకాకలేస్తోంది. కూడెట్టు

చంద్రి—రండు. రండు. (అని తీసుకొనిపోవును.)

[6 వ మాయావేదప్రుడు ప్రవేశించును.]

6 మా-వే—(తనలో) ఔరా! కండ్లయెదుట గనంబడుదానినే నమ్మక తాననుకొన్నదే సత్యమనియు-ధర్మమనుచు దలంచి విప్రులీ గువారికనెందఱుండిరో గదా ? కానిమ్ము. దీనిగర్వమెంత ? ఇది యెంత ? (అనితలుపుదట్టుచు) సౌందరీ! సౌందరీ!! కాళ్లుపీకిపోతున్నాయి. రావే తలుపుతియ్యి.

చంద్రి—(ప్రవేశించి తనలో) హర! హర! నాకెంతదుర్గతి ప్రాప్తించినది. నాకిట్టి విషమపరీక్ష వచ్చుటకు నేజేసిన పాపమేమి ? పరధనకనకవస్తువాహనంబుల కాసింపలేదే. పాపాత్ములం గలనైనం బరికింపలేదే. పతిపూజ సేమరలేదే! నాయట్టిమహాపతివ్రత లేదనిపించుకొంటిని గాని సామాన్యకాంతను గానే. నాయట్టిసుగుణఖని కిట్టివిషమపరీక్ష వచ్చుట కేమికారణము ?

6 మా-వే - నీసిగదరగ- ఏంటిట్లాగాంలో సీత్తున్నావు. నెల్లాళ్లయిందిగదా నీవు నీపుట్టింటికొచ్చి, యింతవఱకొచ్చినావు గానెందే. ఈడ నేంజేత్తున్నావే దరిద్రపుకూతరా !

చంద్రి—(తనలో) ఇంకిప్పు డేమన్నను లాభములేదు. దొంగను దొంగయేనిగ్రహింపవలయును. (పైకి) నాథా ! వెంట మొగవారులేకుండ నే బ్రయాణము జేయఁగలనా ? మీరు వచ్చెదరేమోయని యెదురు తెన్నులు జూచుచుంటిని. మీరెప్పుడువచ్చిన నప్పుడే నేసిద్ధముగా నున్నాను.

6 మా-వే—మనిషినిచూచి మనిషిమాట్లాడతావు మాయముండా! నీపుట్టిల్లు నీకు బాగుంటే సేన. అత్తిల్లణగారిపోయినాచరే.

చంద్రి—ప్రాణేశ్వరా! అంతయో ఇంతయో చంద్రిముఖి మహాపతి వ్రత యని యనిపించుకొనుచున్నాను. గౌరవప్రపత్తులతో బ్రదుకుచున్నాను. నాసంగతి నెఱింగియు నన్నిట్లనుట భావ్యమా?

9 వ అనుబంధము.

పిలికివాఁడగు గోపాలునితోడను, నాబోటి యాఁడుదియే యగు మాలినితోడను బ్రియాణమొనర్చుట కిష్టపడక నే నాగితిని గాని నాయం దేదోషమును లేదు. క్షమించి లోనికిరంము.

6 మా-వే—సరే. క్షమించడానికేంలే. పద. (చెట్టాపట్టాలు వైచుకొని నిష్క్రమింతురు.)

[7 వ మాయావేదప్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

7 మా-వే—(తనలో) ఒకయాపదనుండి తప్పించుకొనఁదలంచి యింకొక క్రొత్తయాపద నెత్తిబడ వైచకొను మూర్ఖునిచందంబున నీమెనడవడియందేతమాత్రమును లోపము లేకున్నను తన మాయామనోహరున కపనమ్మిక గలుగకుండుటకై యసత్యంబులుగూడ నాఁడుచున్నది. ఇంక నీమెకుప్రాయశ్చిత్తమొనర్చుట కొంతకానలయును. (అనితలుపుదట్టుచు) లోని వారెవరో తలుపు తెరండి (అనిపిల్చును)

[తెరలో] ఎవరువారు?

7 మా-వే—ఆమాట్లాడినది చంద్రిముఖియే సందేహము లేదు (పైకి) ఓలే! నీకేంరోగమే. సచ్చుముండా! ఈడబడి సత్తుండాను. రావే తలుపుతీయ్యే. గొంతుకెండిపోయి సత్తుండాను,

చంద్రి—(ప్రవేశించి చూచి తనలో) ఈవరుస బాగున్నది. ఇట్లెన్ని మారులు నన్ను నాపతి పరీక్షింపఁదలఁచెనో గదా? ఇప్పటి కాఱుగుర నాఱుస్థలంబుల యందొకరి నొకరెఱుఁగుట కవకాశము లేకుండ దాఁచియుంచితిని. ఇంకను నిట్లెంతమందిని దాపవలయునో యేమో యెఱుఁగ రాకుండ నున్నది. (సంశయముతో)

ఉ. నన్నిటు మోసపుచ్చుటకు । నాథుని భావ మదెట్టిదానొ ? యీ మన్నిటువంటి సత్యమెది । యో ? గన నూహ కతీతమై, మహా పన్నతమూలమై బహుళ । పాపచయంబున కాస్పదంబునై యున్నది గాని నన్నిఁక సు । ఖోన్నతిఁ గో మనసీయఁ దెమ్మెయిన్.

కానిమ్ము! జోటఁదలదూర్చి రోఁకటిపోటులకు వెరువనేల? నా యదృష్టమెట్లున్న నట్లగును. (పైకి) మనోహరా! లోనికి దయసేయుఁడు.

7. మానె - ఓ చెట్టా !

క. పడియుంటివి పుట్టింటని
వడివడి విచ్చేసినట్టి । పతి నెంతో ప్రే
ముడి నాదరమును జేయక
మిడుకుచు మిడుకుచు జూచి యిట్లు । మిడుకుదు వేమే?

క. నెల్లాళ్లయి పుట్టింటికి
నల్లఁగవచ్చేసి యిసట । నస్తివి నీవు
ట్టిలెల్లను బుగ్గవ య
త్తిల్లును మగడును నెటైన । చెట్టాసరియా ?

పతిరతనని పలుకాడే దానవుగందా? ఇదేనా నీపతిరతతనము? పతిలేడనుకొనే పుట్టింటికాడ సతికలబడ్డావా? మొగుడి లెక్కేంటనుకున్నావా?

చంద్రి—నాథా ! మీరిట్లాడిన నెట్లుచత్తును. నేను నాపుట్టింటికి బయలుదేఱి గడపదిగుచుండగ నకూ్రరుండెవరు వచ్చినప్పుడే యేదియో యొక ప్రమాదము వచ్చునని యనుకొని భయపడుచునే యున్నాను. నేనెట్లు భయపడుచుంటినో యట్లేయైనది. దుశ్శకునఫలంబూరక పోవునా ? నాఁటి కాగిపోవుదమనుకొన్నను- నాఁడుతప్పిన మఱల మాసత్రయమువఱకు ప్రయాణోచితదినము లేకుండుటచే భగవంతుఁపై భారమునైచి వచ్చితిని. వచ్చిన దుష్ఫల మనుభవించుచున్నాను. నాథా! క్షమించి లోనికి దయసేయుఁడు.

7 మా- వే—తప్పుసెయ్యాడం ఆనకేడ్దాం అక్షోల్లకున్నదే పద. (నిష్క్రమింతురు.)

[8 వ మాయావేదవ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

8 మా- వే—ఎవరు లోన ?

మాలి—(ప్రవేశించి చూచి తనలో)

చ. ఇది విపరీతమైన నితి ၊ నృత్తము యొదలి యస్మృతంబు నెమ్మదిగ గ్రహింపఁగాఁగలుగు ၊ మార్గము గన్పడునంచు నెంచఁగా దుదకునిగూఢమై, మిగుల ၊ దూరమునై ; దరియించు లేనిదై కదలిక లేనిదైనట్టుల ၊ గన్పడుచుండె నిదేమిచిత్రమో ?

ఇప్పటికే మహాపతివ్రత తనపతిరూపముననున్నవారి నేడుగురనేడుచోట్లుల దాచి యీ మాయనుండి తరించి బైటఁబడి లోకనింద లేకుండఁ జేసుకొను టెట్లాయని యాలోచించుచుండ నింకొకఁడు సిద్ధమయ్యెను. ఈమెకీ దుర్గతి తటస్థించుటకు మూఁడుమార్గములు గాన్పించుచున్నవి. ఒకటి రాధాకృష్ణులను నిందించుట రెండు భక్తదూషణము. మూఁడు గర్వాంధత. ఇందలి ప్రతిఫలము బూర్ణముగా నీమె బడయవలయు

నని యే పరమేశ్వరసంకల్పము. ఇది తన నాథుని మహాత్మ్య మనుకొనుచున్నది గాని పరమేశ్వరుఁడే తన గర్వభంజన మొనరించుట కిట్టిపన్నుఁగడ బన్నెనని గ్రహింపఁజాలకున్నది. (శిరఃకంపన మాచరించుచు) దీని పర్యవసాన మెట్లుండునను దుద కంటజూడవలయునేగాని యూహింప నాతరము గాదు.

8 మా-వే — మాలినీ! నూసెంది రేం జేత్తుంఁడాదే?

మాలి—ఇంతవఱకు లోన మీతోఁడ నేగిదా మాట్లాడుచున్నది.

8 మా-వే—ఇదెందే. నే నూరినుం చిప్పుకొత్తుండానుగందా? నాతో వూసాడుతూందంట్లా వేం.

మాలి — భక్తత్రాణపరాయణా! ఆదినారాయణ!! నీమహామహిమ గనిపెట్ట నెవ్వారితరము!

8 మా-వే — నాతో మాట్లాడుతోందన్నావుగందా? అల్లా మాట్లాడుతోం టె నువ్వుసూశావా?

మాలి — స్వామీ! నేనేమియు దెలియనిమూఢురాలను. క్షమింపుఁడు. అదిగో! ఆసాధ్వీమణి యే యిటువచ్చుచున్నదా మె నే యడుగుఁడు. (నమస్కరించి వెడలును.)

8 మా-వే—(తనలో) ఈమె యింగున్న రహస్య మింపుక గ్రహించినది.

చంద్రి—(ప్రవేశించి) నాథా! ఇట్లు నిలువంబడిపోయితి రేమి? లోని కిదయసేయుఁడు.

8 మా-వే— నువ్వోరితో టె మాటలాడుతూంట?

చంద్రి — నే నెవరితోడను మాట్లాడుట లేదే?

8 మా-వే—అబద్దమాడుతున్నావా? లోనకి సహ నీచంగతి కనుక్కుంటాను.

చంద్రి—అది హర్షింప వలసినమాట. దయచేయుఁడు.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

[అప్పుడు కృష్ణుఁడు మాయావేదవ్రునిరూపమున బ్రవేశించును.]

**మా-వే**—(తనలో) నాయాజ్ఞానుసారముగా రాధయు, నకూ్రరుండును విచ్చేసియున్నారు. నారదుఁడు సమయమున కరుదెంచును. మాలినియు నిచ్చటనే యున్నది. ఈమె గర్వమడంచుటకుఁ దగిన యవకాశముగూడ మిక్కిలి సమీపించినది. రేపల్లె నుండి వేదవ్రుఁడుగూడ వచ్చుచున్నాఁడు. ఇప్పటికి లోనఁ బ్రవేశించిన మాయావేదవ్రు లెనమండ్రును దన ప్రాణేశ్వరుని ఛాయాప్రతిమ లనుకొ"ని విర్రవీగుచున్నదిగాని సత్యం బెఱుంగఁజాలకుండ నున్నయది. తెల్లవారినచో నిందున్న రహస్యమెల్ల వెల్లడియగును. అప్పుడీ చంద్రముఖి తనతప్పు దాగ్రహించుకొని— నాఁటినుండియు భక్తాగ్రగణ్యురాలయి, పతితపావనియై మహాపతివ్రతయై సాటిలేని యశోలక్ష్మి నార్జించుకొని సుఖంబుండును. అదిగో! చంద్రముఖి విచ్చేయుచున్నది. ఏమియుఁ దెలియనట్లే నటించెదఁగాక.

చంద్ర— (తనలో) ఈతఁడు నా నిజమైననాథుఁడు. ఇంతవఱకరుదెంచినవారెల్ల నానాథుని ప్రతిబింబములు. నానాథుఁడు నన్నా విషయమై ప్రశ్నించువఱకు నేనేమియు నెఱుంగనట్లే నటించెదను. (పైకి) ప్రాణేశ్వరా! ఇంతవఱ కెక్కడ కరిగితిరి? నన్నొంటిఁజేసి వెడలుట భావ్యమా?

**మా-వే**—ఇంతసేపు నీవీడనే యున్నావంటే.

చంద్ర— ఉండక లోనికరుగుట దోషము గాదా?

**మా-వే**— నీవు లోని కెల్లనేలేదా?

చంద్ర—లేదు.

**మా-వే**— సరి. సరి. బాగుండి. పదలోనికేల్దాం. (అని నడచుచు నేను వెళ్లగా నీవెను లోనికిడచి రాధను తీసికొందుగాక

(అని నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.



శ్రీ

# రాధాకృష్ణలీల

అను

# చంద్రముఖీగర్వభంగము.



పంచమాంకము.



—| స్థలము:— పూఁగవని యుయ్యెలగలభాగము |—

[చంద్రముఖి నిలువఁబడియుండఁగాఁ దెఱతీయును.]

చంద్ర—(తనలో) ఈ యుదయమునఁ బ్రయాణమునకు సిద్ధముగా నుండవలసినదని యాజ్ఞాపించిన ప్రాణనాథుఁ డింతవఱకు కెందరిగనో యేమో యేమియు దెలియదయ్యెను. నిన్నటి రేయి నన్నుఁ బరీక్షించుటకై నాభర్త సన్నిహితసన్నాగ మత్యద్భుతమై యున్నది. ఆ యెనమండుగుర నెనిమిది స్థలంబులందును దాఁచితిని. నాచే దాచఁబడినవారు దాచబడినట్లే యుండిరిగాని యొక్కరుఁడును నంతర్ధానము గాలేదు. ఇంకను నా నాథుని పరీక్ష ముగియలేనట్లున్నది. రహస్యమేమియో నా కవగతమైపోయినది. ఇఁక నేనాతని మాయావాగురులం జిక్కుకొందునా?

1 మా-వే—(ప్రవేశించి) సెందిరీ! యెల్లానని నీవందరితోటీ సెప్పి సిద్ధంగా నున్నావంటే.

చంద్ర—నాథా! సిద్ధముగానే యున్నాను.

[అప్పుడు కొంచెముదూరమున రాధాకృష్ణులును, అక్రూర నారదులును ప్రవేశించుచున్నారు.]

కృష్ణు—అదిగో! చంద్రముఖీగర్వభంగంబగు ముహూర్తము దాపై యున్నది.

అక్రూ—స్వామీ! నీమహామహిమ నెఱుంగుటకు మేమెంతవారము.

* శా. కృష్ణా! నీవొనరించుకార్యములు వర్ణింపఁగా సమర్థుండె వ
ర్ధిష్ణుండైన విధాత మూఁడుగుణముల్ దీపించులోపించు రో
చిష్ణుత్వంబుననుండు నీవలన నిస్సీమంబు నీరూపు సీ
విష్ణుఁ జిష్ణు, సహిష్ణు, నీశు నమితుఁ, విశ్వేశ్వరుఁ బ్రొక్కెదన్.

చంద్ర—(రాధాకృష్ణాదులనుజూచి తనలో) నాఁడు అక్రూరుం డాడు మాటచే నీదుర్గతి వచ్చినదని కుందుచుండ నేఁడు మఱల వీరెల్ల రెదురైరి. యేమిపాపము. ఇందువలన నాకింకను నెట్టిదుర్గతి సంభవించునోగదా?

1 మా-వే—నిలబడిపోనావేమే. నడు. నడు.

చంద్ర—శకునము మంచిదిగాదని చూచుచున్నాను.

1 మా-వే—శకునమూ లే దేమీలేదు. దిగు. గుమ్మను దిగు.

2 మా-వే—(ప్రవేశించి) సెందిరీ! (అని పిలచి 1 మా-వేదవ్రుని చూచి) సెందిరీ! అచ్చంగా నాకుమల్లేయున్న వీఁడోడే?

1 మా-వే - నువ్వోడివోరే- దానితో వూసాట్టానికి.

2 మా-వే—పోపోరాబైతా! గుండెలు కుళ్ళబొడగలను.

1 మా-వే—తెగనీలకొరే, సెప్పుదెబ్బలు తినగలవు,

3 మా-వే—(ప్రవేశించి) ఓ రెందిరయ్యా! మీరు గుద్దులాడుతారు. ఇది నాపెళ్లాం. దీన్ని డిసి దూరంగాపొండి. (చంద్రముఖితో) రాయే పెళ్లామా! రేపల్లెపోదారి.

10. అనుబంధము.

ఎందే సూత్తావు. రా. రా. (అని చేయిఁబట్టిలాగును.)

చంద్రి—(విఘ్రాంతపోవును.)

1 మా-వే—ఓ రిదేంటిరోరయ్యా! ఇల్లా ఉసా లేశావంటే చిటిక మొగుత్తాను.

2 మా-వే—ఏం టేముంధా మాటఁగాడవు? ఈళ్ళెవళ్ళే. ఈళ్లందఱూ నీమొగుళ్ళేనంటే.

11 వ అనుబంధము.

[అప్పుడు 4, 5, 6, 7, 8 మాయాపేదవులు ప్రవేశించు చున్నారు.]

4 మా-వే—సెందిరీ! ఏంజేత్తున్నావే?

5 మా-వే—నా పెళ్లాన్ని పిలుత్తా వెందోరయ్యా!

6 మా-వే—నీ పెళ్లామేంటిరోరయ్యా! సిన్ను లెన్తాసల్లాగన్నావంటే. జాగరత.

7 మా-వే—(చంద్రముఖిఁ గాంచి క్రోధముతో) ఏయ మిచ్చు ముండా!

12 వ అనుబంధము.

8 మా-వే—ఓరబ్బ! ఇదేంటి రీగొడన, సెందిరీ! వుత్తిము జేసినోణ్ణి నేను. ఈళ్ళంతా దెయ్యాలుగావోసు. నేనే నీ కసలైన మొగుణ్ణి. అవునో కాదో నీకానమాలు సెప్పుతానిను. (రహస్యముగా) నీ తొడలో పుట్టుమచ్చ వుంది. (పైకి) ఏమంటావు. ఈళ్ళనొదుల్సుకు పోదాంరా! (అని రెక్కబట్టి లాగును.)

2 మా-వే ఓరెుదిరయ్య దాన్ని లాగుతావు. నువ్వేగాని నేనలగ నేంట పుట్టుమచ్చ. నేను నిద్దట్లో పలవరిత్తె నువ్వినిలా చేత్తు న్నావా ? డొక్క సిరగ మొకుత్తాను సూడు.

5 మా-వే ఓ రాడాలితస్సాగోయ్య ! మీాయేసాలు బాగున్నాయ రా ! అసలోణ్ణి నేనిల్లా గతమారిపోవాలసిందే గామోసు. మీారంతా దీన్నను బగిత్తారు కామోసు. సడసంగానే వుంది. ఇంకేం. (చంద్రిముఖితో) ఏవేం. ఈళ్లంతా నిన్ను పెళ్లామం టూంటే వూరుకుంటావేం. ఈళ్లంతా నీమొగులేనాయేంటి ?* పుట్టింటికి రాగానే నీబుద్దిల్లా మారిందేమే యెదవా ? ఈళ్లు నీమొగులుగాకపోతే తొడలోపుట్టుమచ్చున్న ట్టీళ్ల కెల్లా తెలి సిందే దెట్టా ! యీా నెల్లాళ్ళల్లోనూ యింతమంది మొగుళ్లని సంపాయించావే నంజా ! నోరెత్తె కొత్తావా ! తన్ననా ! (అని కొట్టును.)

6 మా-వే — తన్నకో తన్ను. ఎల్లాతన్తావో సూత్తాను. నాపెళ్లాన్ని తన్నడానికి నువ్వెవడవోరే. మానోరు జేత్తున్నావు ?

8 మా-వే— సూసినావంటే యెదవ. యీాయెదవతో నేస్తం కట్టావు గావోసు. నీబలం సూసుకుని నన్నే తన్తానంటున్నాడు, ఇల్లాం ఒదవవని తెల్సింది గాదే. నీసిగదరగ. (అని చంద్రిముఖిని గొట్టును.)

రాధ — (వికావిక నవ్వును.)

చంద్రి— (విచారముతో దనలో) కట్టా! ఎట్టిదురవస్థ వచ్చినది. ఇది నా మనోహరుని మాయావిలాసంబని యనుకొనియుండ నిట్టి విపరీత ముత్పన్నమైన దేమిపాపము? ఈ యెనమండుగు రెవ్వ రైయుందురు? వీరిలో నాపతి యెవ్వరై యుండును? మహాపతి వ్రతనగు నాకిట్టి దురవస్థ వచ్చుట కేమికారణము. శంకరా !

నాకిట్టి దురవస్థవచ్చుటకుఁ గలకారణ మెయ్యదియో నాకు దెలియకున్న మానె నిది తొలంగి నేను వొంటియట్లు సుఖం చుమార్గం బైనను నాకుఁ జూపింపుము. నేను పతివ్రతనని యెంతమిడిసి మిడిసిరాలిపడిపోయితినో యంతకష్టమైనది. నిక్క మునకు నాగర్వమే నన్నిట్టి దుర్గతికి దెచ్చినది. ఇది నిశ్చయ ము. ఆట్టిగర్వమే కన్నుమిన్ను గానకుండఁ జేసినది. భర్తల నిందింపఁజేసినది. పూజ్యురాలయిన రాధ ననరాని మాటలని పించినది. ఏపాప మెఱుఁగని యక్రూరు ననరాని మాట లని దూషింపఁజేసినది. శ్రీమన్నారాయణావతారములలో నొకటి యగు శ్రీకృష్ణావతారము గాంచియు, గర్వాంధురాలనయి భగవన్నింద యొనర్చితిని. లేనిపోని బీరంబులాడితిని. అసత్యం బులాడితిని. ఏతత్పాపఫల మనుభవింపకుండఁ బోవునా ? పరమేశ్వరుఁడు గర్వభోతుల నెన్నఁటికేని క్షమించునా ? ఓ నందనందనా ! అబలను. అనాథనుదరుప్రను. మూర్ఖురాలను. పతితురాలను. నన్నురక్షించి- నన్నను గ్రహింపుము. దేవా! నీవనుగ్రహించినచో దృణము మేరువగును. నీయనుగ్రహము లేనినాఁడు మేరువే దృణమగును. నిన్నుదెలియక దుర్భాష లాడితిని. నిభక్తుల దూరితిని. దేవా ! నాగర్వ మడంచితివి. ఇది నీమాయయేగాని మరియొండుగాదు. మానవమాత్రుం డగు నామనోహరున కిట్టిసామర్థ్య మెట్లలవడును. దేవా! ఇంత కాలమునకుఁ గండ్లుదెఱచి నీమహామహిమయని దెలిసికొంటిని. హిరణ్యకశ్యపాదిరాక్షసులెల్ల రంత్యకాలంబుననే నీమహామహి మఁ గనిపెట్టి నీచే ముక్తినిఁ బడసిరి. దేవా ! నేనంతకంటె క్రూరదానవిని. పాపురాలను. అంత్యకాలంబునందైన నిమహా మహిమ గనిపెట్టఁదగు సామర్థ్యము లేనిదానను. నన్నురక్షిం

చి- నాగర్వమడంచి- నాపతితో నన్నుఁజేర్చి- నన్నుఁ గాపాడుము. దేవదేవా ! నన్ను రక్షింపుము.

సీ. అత్యంతబలశాలి । ననివిట్టివీగెడి
బలుని గర్వము దుర్ఘించి । వరలినావు;
తాలక్ష్మి ననిమెప్పు । తగఁబొంగు సత్యభా
మాగర్వమును దుర్ఘించి । మనిచినావు;
మునినన్న గర్వంబు । గొనిఁ క్రుత్తు నేచిన
దూర్వాసుగర్వంబు । దుర్ఘించినావు
భుజబలవిస్ఫూర్తి । బొంగిపోయెడి గరు
త్మంతు గర్వమడచి । మనిచినావు
అల్లితగనితప్పని గర్వ । మందియున్న
నాదుగర్వంబు హరియించి । నావుసామి !
నేఁటితో బుద్ధివచ్చె మ । న్నింపుమయ్య
రాధికాస్వాంతలోల ! ప । రాకిదేల ?

3 మా-వే—మాటాడవెందే. మాలో నీమొగు డెవ్వఁడో సేప్పే.

7 మా-వే—దిక్కులు సూత్తా వెందే. రాయే నాయెంట.

4 మా-వే—(అందఱితోడను) ఓరయ్యలారోయి యినండి. మవమంతా కొట్లాడుకోడ మేమీ లాబంలేదు. యీామొతవముండ మొండికెత్తింది. ఈచంగతి నలుగురిలో బెడితేనేగాని దీనికి బుద్ధిరాదు. ఆళ్ళెల్లా తీరుపుసెపితే అల్లా మనమంతా యినుకుందాం. పతంతారు.

2 మా-వే—ఈడిసుద్ది బాగుందిరా ?

5 మా-వే—సాలా బాగుంది.

1 మా-వే—ఓ రేంటిరయ్య యీాగోడవ. నాపెళ్లా మేడితోటో లేసిపోయిందని యెల్లాగోరయ్య సెప్పుకోవటం. మొగుఁడు పెళ్లాల

పోరు పైవోళ్ళు తీర్సకమేంటోయి యెదవగోల. బుఱ్ఱ సితగ
మొడితే దానిమొగు డెవఁడో- అదే సెపుతుంది.

4 మా-వే.—దానిమొగుఁ డెవఁడో- అది సెప్పదంటావు. నువ్వగా
వేంటిరా దాని మొగుడివి?

1 మా-వే.—నేను దానిమొగుణ్ణేగాని- నువ్వగావని నువ్వే సెప్పు
కొంటున్నావు.

7 మా-వే.—(ముందునకుఁజూచి) ఓరయ్యొ! అదుగోరా చేపల్లెవాడ
కిట్టప్ప. ఆడికూడా యీకేరో యిగ్గలున్నారురా? రాదమ్మ
కూడానే వుందిరా! ఆళ్లనీడకు పిలిసి మన యవ్వారమంతా
సెప్పి యీసేరా విసారించి నాయం దయసేయమని యడుగు
దాం రండిరా!

5 మా-వే.—మామంచోణ్ణి నెలకాగురా? అమగానీ మనతగాయదా
యున్నాడంటే మనకళ్లల్లో దుమ్మోసి నీన్నాడే తీసికెళ్లి
పోతాడు. అనక మనమంతా కూకోని యేడవాలసిందేగాని యే
మీ నాబంనేదు. నే సెప్పేదేంటే మనలోమనమే యెల్లాగో
సక్కపడి కొన్నాళ్లొకళ్లము- కొన్నాళ్లొకళ్లము దీన్నేలు కుం
దారి. సుందిరీ! నీకీపద్ద తిట్టమేనా? ఇట్టమైతే సూసుకో.
ఒకొక్కడిదగ్గఱ నెలాపదేనుదినా లుండవచ్చును. అల్లా
గైతే బంతులు కుదురుతాయి. దెబ్బలాటలురావు. ఏతంతావు.
నాసుద్ది నీకు నచ్చిందా? నచ్చితే సెప్పు. ఈళ్లని నే నెల్లాగో
యొప్పించెదను.

8 మా-వే.—ఇల్లాంటి యెదవమాటంటే గుండెలు కుళ్లమొడుత్తాను.
యెల్లాగో పైబడిపెళ్లాన్ని లాగియ్యాలని మీరంతా సూత్తుం
డారు గావోసు. మీయాటలు నాదగ్గఱ సాగవు. యేదన్నంటే
యెత్తియెదవనుకున్నావు గావోసు. దూదేకినట్టు మిమ్మొందఱినీ

యేకేసి నాపెళ్లాన్ని నే తీసికెళ్లిపోతాను. మీారెవళ్లొత్తారో రండి సూత్తాను.

2 మా-వే—మనలోమనం కొట్టుకుసావడమేం పనిరా యెదవపని. కుట్టణ్ణి వాళ్లని పిలిసి సెప్పుకుందారెహే. ఇంతమాత్రాన్ని దీన్నొదెగ రెయ్యగలడేంటి యెదవమాట.

3 మా-వే — నాకిట్టం లేదు.

5 మా-వే—నాకూాను.

6 మా-వే—పైవోళ్లతో సెప్పుకోడం దద్దమ్మపని. నాకిట్టంలేదు.

7 మా-వే - అంతకంటే నామర్దాపని లేదు.

4 మా-వే— మీారందఱెల్లాగంటే నేనల్లాగే.

1 మా-వే - ఒరేయి. ఈయెదవసెడిపోయిందిరా? దీనితో సంసారం సెయ్యడంకంటే నామర్దాపని యింకలేదురా? కనక నేసెప్పి దేటంటే యిల్లాంటియెదవపని సెయకుండా అందోళ్లకెల్ల బుద్దొచ్చేనాగ మనమచ్చు దీర దీనిని సావగొట్టి యిక్కడిడిసేసి పోదాగి. మనకి పెళ్లామే దొరకదేంటి. తలకోదానినిపెళ్లాడి సుఖంగుందాగి.

3 మా-వే—బాగుందిరా నీసుగ.

4 మా-వే—ఎయ్. ఎయ్. దొంగముండని కుల్ల మొుడిసెయ్.

5 మా-వే—కానియ్యండి బేగి కానియ్యండి.

6 మా-వే—సూత్తారెందిరా? పాడండిపోదం.

చంద్రి—(తనలో) అయ్యో! నాపాపపుబుద్ధి యెంతగడ్డి దిన్నది. గాగర్వము నన్నెంతవఱకు దెచ్చినది. నే నీమహామాయ నుండి తరింపవలె నన్న నా శ్రీకృష్ణుని పాదసేవయే పరమా షధము. (అని వడివడి శ్రీకృష్ణునిఁ జెంతకరుగుచు) కృష్ణా! కృష్ణా!

శా. పాతివ్రత్య మహాత్మ్య మున్నదనుచున్ । భావించి గర్వాంధనై
నీతిఁ బాసి వివేకహీననయి మన్నిం । పన్ దగున్ బెద్దలన్
నాతోఁ బోలరటంచు ద్రోలితిని కృ । ష్ణా ! తత్ఫలం బిప్పుడీ
రీతిన్ బ్రాపమె నాదుతప్పులను సై । రింపఁ గ్రిన్నఁ వేఁడెదన్.

మ. అపరాధంబులు వెక్కు జేసితిని నే । నజ్ఞాననై యుంట, నా
యపరాధంబులు గుర్తెఱింగి తమపా । దాంభోజముల్ ముట్టినన్
గృపతోఁ బ్రోవుమటంచు వేడితిని శ్రీ । కృష్ణా! దయాసింధు నా
యపరాధంబులు సైచి నాదుపతి నా । కర్పింపుమీసద్దయన్.

మ. కనుగర్వాంధ మనస్కనై తమదు భ । క్తవ్రాతముం దిట్టి మీ
యడుగుల్ గొల్చెడిరాధ జారిణియటం । చామెన్ వెసన్ దూఱితి
ప్పుడు మిమ్మున్ జెడదిట్టి సూనృతము నే । బోనాడితిఁ నేడు నా
కుడిగెన్ గర్వము నిన్నెఱింగితినినో । హా! స్వామి! సన్నొంచి వే.

సీ. చేపరూపముదాల్చి । పాపాత్ముసోమకుఁ
మ్రందించి వేదముల్ । బ్రహ్మకొసఁగి
ఆజగన్మోహిని । యవతారమునుదాల్చి
తగుసుధ నెల్ల త్రి । దశులకొసఁగి
నారసింహుడవయి । క్రూరదానవుఁజంపి
ప్రహ్లాదునకు నీ వ । భయము నొసఁగి
రామావతారివై । రావణుఁ బరిమార్చి
సర్వలోకములకు । సౌఖ్యమొసఁగి
పరశురాముండవై క్రూర । నరులఁజంపి
నేఁడు కృష్ణావతారివై । నిలచి యిచట
శిష్టులనుబ్రోచి దుష్టుల । శిక్షజేయ
బద్ధకంకణము నొనవె । పద్మనాభ.

(అని పదంబులపైవ్రాలి) దేవా! రక్షించుము రక్షించుము. నాబుద్ధి లేమిని క్షమించుము.

కృష్ణు — (చంద్రముఖని లేవనెత్తి) చంద్రముఖీ! యిప్పుడు నీకువచ్చిన మహాపద యేమి ?

చంద్ర — దేవా! శ్రీమన్నారాయణా !

తే. గీ. అరగో! యెనమండ్రు యెవ్వరో । యరుగుదెంచి
నీపతిని నేను, నీపతి । నేనటంచు
పైపయింబడి వాదాడి । పట్టి గొట్టి
చంపజూచుచునుండిరో । జలజనాభ.

స్వామీ !

మ. పతియెవ్వాఁడో యెఱుంగఁగా గలుగు నా । ప్రజ్ఞావిశేషంబుసం
తతగర్వంబునపాడొనర్చుకొని యీ । దైన్యస్థితిం జిక్కి దు
ర్గతిపాలైతిని నన్నుబ్రోచి మఱినా । కాంతుం వెసం జూపి నా
వెతజల్లార్పవె దేవదేవ! వరదా! నీ । క్షించి నం సద్దయం.

ఉ. నీమహిమంబునేనెఱుఁగ । నేరక దుర్మతి నింతకాలముం
దామసవృత్తితోమెలఁగి । తత్ఫలమిప్పుడుబొందియుంటి స
న్నోమముమ భక్తవత్సల! స । మున్నతి నీదుకృపారసంబులో
నేమిటనీకు లోటొదవు । నీపదదాసిఁబ్రోచు నంతలోన్.

కృష్ణు — చంద్రముఖీ! నీమనోహరుని నీవు గుర్తింపగలవా ?

చంద్ర — గుర్తింపఁగలను.

నార — దేవా ! శ్రీమన్నారాయణా! అగొల్లలెవ్వరినో నల్వురదగు మనుజుల దోడ్కొనివచ్చిరి.

కృష్ణు — కానిమ్ము. మనము వారిచెంత కరుగుదమురండు.

[ఒకరి నొకరు సమీపింతురు.]

కి. మా - వే - అయ్యా! మీరు పెద్దమనుజులు. ఇనండి. ఇదినాపెళ్లాం

దీన్నిట్లాగెయ్యాలని సూస్తున్నారు. దీనభిప్రాయమేంటో నా కుతెల్దు. మీరిశారించి నాపెళ్ళాన్ని నాకిప్పించండి.

4. మా-వే — పెద్దమనుజులయెనుల బాగకను. నాపెళ్ళాన్ని నీపెళ్ళా మంటావేం.

1. పె-మ — మేము విచారించెదము మీరూరకుండుడు. చంద్రిముఖీ! వీరిలో నీభర్త యెవ్వండు ?

కృష్ణు—చంద్రిముఖీ ! నీభర్తను గుర్తింపగ గలనంటివి గదా ? గుర్తింపుము.

చంద్రి—నాభర్తకు గుడిపార్శ్వమున నొక పెద్ద పుట్టుమచ్చ గలదు.

2. పె-మ—(అందరినుజూచి) చంద్రిముఖీ! అందఱకట్టిపుట్టుమచ్చ సరిగా నచ్చట నేయున్న దిప్పుడేమి చేయుదువు ?

3. పె-మ—శ్రీకృష్ణపరబ్రహ్మ మిట్టి సంశయము మనము యీమెపై తెలిగినిపెట్టుట! నాకేమియు బాగుగ లేదు. మనమందఱమామహానుభావుని పదారవిందములపై వ్రాలి వేడుకొందము. ఇదియు నామహాత్ముని లీలయైయుండును.

రాధ — జారచోరుండగు శ్రీకృష్ణునివలన నేమగును? అంతయేనా చంద్రిముఖీ !

చంద్రి—అమ్మా ! చచ్చినపామును నేల గొట్టెదవు ?

కం. తెలియక పరుసములాడితి
తెలిసియు నేకగతుల నీను । దీనతతో వీ
యదుగుందమ్ములపైబడి
లలనా ! మన్నింప బ్రతిమ । లాడుచునుంటిన్.

శా. అమ్మా! మిమ్మనరాని మాటలనియు । న్యాయంబుగాదిట్టి శ్రీ
ఘ్రమ్మే నాథునితోడ జెప్పి మఱి నీ । గర్వంబు ఖండింతు నా

చమ్మాడ్కిన్ వచియించి యీగతికి లో । నైబోతి రక్షింపుమం
చమ్మా ! యంజలి జేసి మ్రొక్కెదను నా । శానందమున్ గూర్పవే.

రాధ—చంద్రముఖీ ! విచారింపకుము. నీతప్పు నీవు దెలిసికొంటివి. ఎవరిదోషము వారెఱుంగుట కష్టము. అట్లెఱింగి రక్షించుమని శ్రీకృష్ణుని చరణారవిందములపై వ్రాలితివిగావున నీవు రక్షింపఁబడియెదవు.

*చ. నగమనిజెట్లు పాపఁడని । నాగరికుల్ మఱుఁడంచుఁ గొంత ల
భ్రగపతి విశ్వరూపుఁడని । ప్రాకృతుఁ డంచును గోపబాలురు
గ్రగతిఁ దనర్చు మృత్యువని । కంసుఁడు యోగులు స్వామిగాఁగనం
దగిసురలుం బరంగమున । దాగ్రొను దేవుఁడునిన్ను బ్రోచుతన్.

అక్రూ—అమ్మా! చంద్రముఖీ! నీవు పతివ్రతామణివే యగుదువు. ఆ బలముజూచుకొని తక్కినబలంబుల నిరసించితివి. దానికిట్టిపాటు లభించె. భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదుని ద్వేషించి యాతని ననేకగతులఁ జంపఁ బ్రయత్నించుటచేత హిరణ్యాకశ్యపునకు మర్మరణము సంప్రాప్తించినది. నీ కట్టిపాటు రాకుండ శీఘ్రమే మేల్కొంటివి. ఇంక నీకు శుభంబగుఁగాక.

*ఉ. ఇవ్వలనవ్వలన్ వెదక । నేటికి నన్యుల మాటిమాటికిన్
దవ్వులనుండిరైనఁ గరు । ణావరుణాలయ గోపమూర్తియై
నవ్వుచు డాయవచ్చి యద । నన్ శరణాగతవజ్రపంజరుం
డవ్వనజాతనేత్రుఁ డన । యంబు నయంబు సెలంగఁబ్రోవఁ డే.

నార—చంద్రముఖీ! ఇటువినుము. నీ గర్వము నిన్నెంతవఱకుఁదెచ్చినదో గనుము. నీ చెలికత్తియయగు మాలిని నీకింతగర్వము గూడదనియు, నద్దానివలన నీకు మిగుల బ్రమాదమువాటిల్లుననియు నీకుపదేశించినది. కాని గర్వము నీతలకెక్కి తాండవించుచుండుటచే దానిహితవాక్యములు నీతలకెక్కలేదు. నీయం

దున్నకళంకగర్వము బోగొట్టకున్న నీకు ముక్తిలేదు. ఎచ్చట నోబుట్టి నీయదృష్టవిశేషంబున రేపల్లెలో బడితివి. అవతార పురుషుండగు శ్రీకృష్ణునిం గన్నులారగాంచి, యాతని నామ మనవరతంబును జపించి, ముక్తిబడయుటకు మారుంగా నాతం డొక మానవుండనుకొని యాశ్రీకృష్ణపరబ్రహ్మను నిందించి తివి. ఈకృష్ణుండెవ్వనిగా దలంచితివి?

క. ధరఁబరబ్రహ్మమనఁగా
బరతత్త్వమనంగఁ బరమ ‖ పదమనఁగను నీ
శ్వరుఁడనఁ గృష్ణుఁడన, జగ
ద్భరితుఁడు నారాయణుఁడు ‖ దావెలుగొందున్.

అల్పజ్ఞానసమేతురాలవగుటచేతను, గర్వాంధురాలవగుటచేతను, నీవీ యంశ మెఱుంగక, నీ పూర్వజన్మవాసనా బలమింకను నిన్ను విడనాడకుండుటచే నిట్టిచేటు వాటిల్లినది. అట్టి నీదోషమున కిట్టిశిక్ష పరమేశ్వరుఁడు నీకు విధించినాఁడు. నీ యజ్ఞాన మిప్పుడు తొలఁగిపోయినది గాన, యాస్వామిపాదములపైఁ బడి రక్షింపుమని వేడుము. నిజమైన పశ్చాత్తాపముగలవారి నీ పరంధాముడు రక్షించితీరును. నీవట్లు ప్రార్థించిన నీ యీ కష్టమెల్లతొలంగి నీ నిజమనోహరుండు నీకుఁ గాన్పింపవచ్చు ను. త్వరపడి యాస్వామి నాశ్రయింపుము.

3 పె-మ—అమ్మా! చంద్రముఖీ! ఈ నారదమానివాక్యములు సమా దరణీయములు. అట్లొనరించి ముక్తిబడయుము.

4 పె-మ—నీవట్లా మహామహుని యాదరణంబునకుఁ బాత్రురాల వైతివేని నీయెదుటనున్న నీకష్టపరంపరలెల్ల మంచువిడిపోవు నట్లు విడిపోవుట నిక్కము.

చంద్ర—మహాత్ములారా! మీయాజ్ఞానుసారమట్లే ప్రార్థించెదను.

నారదమునీంద్రా! నా పూర్వజన్మవాసనాబలంబింకను నన్ను విడువలేదంటి రదియెద్దియో సెలవీయవేడెదను.

నార.-- మానినీమణీ! ఈమహానుభావుఁడు రామావతారంబున నున్నప్పుడీవొక బ్రాహ్మణుఁడవై పరమభక్తుండవై యుండి, నాకంటెపరమభక్తాగ్రేసరుం డీ రేడులోకంబులయందు లేడని గర్వించి హనుమదాదులభక్తిని నిరసించుటయేగాక లక్ష్మణవిభీషణాదులనుగూడ గణింపని గర్వముతోనుండి ముక్తినొసంగుమని శ్రీరాముని గోరితివి. నీగర్వమడంచిగాని నీకు ముక్తినొసంగుటకు వీలు లేదని పరంధాముండు తెల్పెను. తరువాత నీవీజన్మమెత్తి పతివ్రతవైయుండి పతివ్రతామణుల బూరికిఁ గొనవైతివి. వారినెల్ల నిందించితివి. ఇప్పుడు నీగర్వప్రాయశ్చిత్తమైనది. ఇది నీ జన్మరహస్యము. పూర్వజన్మవాసనాబలం బెంతెంతవారికినిఁ బోదు. ఆపరమేశ్వరుని యనుగ్రహము నీపైనున్నది గావున నీవిప్పటికైనఁ దరించితివి. ఆతనిని సేవించి ముక్తిబడయుము.

చంద్ర—దేవా! దేవకీనందనా!

దండకము.

శ్రీకృష్ణకృష్ణా! జగత్త్రైకనాథా! రమానాథ! యోబాలకృష్ణా! నిన్నుఁ గీర్తిసేయంగ నేనెంతదానన్ బరంధాముఁడవంచెంచకెన్నని నిందించితిన్ నిన్ను మూఢాత్మనై గర్వరూఢాత్మనై పాపవారాసిలోఁజిక్కితిన్ నాదుగర్వంబు సర్వంబు సంహారమున్ జేసి రక్షించు మోదేవదేవా! మహామేయరూపా! కృపాసింధు! మాంపాహి మాంపాహి యంచెంతయోదీనతన్ వేడుచున్నాను, స్వామీ! పరాకేల? మీనంబవై వేదముల్ దెచ్చి యావేధకర్పించి లోకంబులన్ బ్రోచియున్నావె కూర్మంబవై మందరంబాసముద్రంబులో

గ్రుంగిపోకుండ నీమూపుపై నిల్పవే, శ్రీజగన్మోహినీరూప ధారుం
డవై క్రూరదైత్యాధముల్ గిండ్లలోగారముగ్గొట్టి పీయూషమెల్లన్
సురానీకమే త్రావగాఁ జేయవే, భూమినిన్ జుట్టి, యీరేడులోకం
బులన్బట్టి బాధించుచున్నట్టి యాక్రూరదైత్యాధమున్ జంపగా
శ్రీవరాహావతారుండవై లోకముల్ బ్రోవఁగాలేవె? నీభక్తునిన్బట్టి
వేధించి, బాధించి, సాధించిమర్దించుచున్నట్టి యాక్రూరదైత్యాధముం
డౌహిరణ్యాక్షుసోదర్యునిన్బల్లుమూర్పంగలో నెంచి శ్రీనారసింహుండవై
స్థంభమందుద్భవింపంగలేదే, మహాభక్తునిన్ గావగాలేవె, యారాక్ష
సున్ ద్రుంపఁగాలేవె సర్వలోకాళికిన్ సౌఖ్యమున్ గూర్పగాలేదె వా
మనావతారుండవైయాబలిన్ద్రొక్కి పాతాళలోకంబులోనుంచి, ఆ యిం
ద్రునిన్ గావఁగాలేవె, రాముండవై విప్రధర్మంబులన్ వీడి పెన్గొడ్డలిన్
దాల్చి ముయ్యేడుమారుల్ కుమారాంతులన్ బట్టిసంహారమున్ జేసియీ
భూమినాసాంమువ్రికున్ దానమర్పింపఁగాలేవె? శ్రీరామచంద్రుండవై
లోకవిద్రోహులైనట్టి యారాక్షసాళిన్ వడిన్ద్రుంచి, లోకంబులం
బట్టి రాపెట్టి సాధించి యేడ్పించుచున్నట్టి యారావణున్గొట్టి సర్వలో
కంబులన్ శ్రేయమున్ బొందఁగాఁజేసి, కృష్ణావతారుండవై మహా
మోహరూపుండవై యిట్టె కాళీయమర్దంబుగావించి, గోవర్ధనం బెత్తి,
కంసాదులన్ ద్రుంచి, నీభక్తునిన్ బట్టి బాధింపగా నెంచి సాధించుచున్నట్టి
దూర్వాసుగర్వంబు సర్వంబు ఖర్వంబుగాఁజేయ నీచక్రమున్ బంపి
దూర్వాసుగర్వంబుబోకార్చితే నిన్ను బ్రహ్మంబుగా నమ్మియున్నట్టి
భక్తాళికేలోపముల్ గల్గకుండంగ రక్షించుచున్నట్టియోసామిదీనార్తిదీ
నంబుతో నిన్ను బ్రార్థించుచున్నాను నీదాసదాసీమణిన్ నన్ను రక్షిం
చి నాగర్వంబున్ వెసన్నిల్పి, నాకాంతునిన్ నాకు జూపించి, రక్షిం
పవే, యాపదల్ బాపవే, మోదముల్గూర్పవే, నీమహామాయ సంతం
బు గావించి నీపాదదాసిన్ ననున్ బ్రోవు మోదేవదేవా! రమాసన్ను

తా! సద్యశోపూరితా! దేవకీనందనా! నమస్తే. నమస్తే. నమః.

13 వ అనుబంధము.

(అని పాదములపై మఱలఁబడును.)

4 పె-మ —కృష్ణా! నీయట్టి మహామహులనకు నాబోటి క్షుద్రురాలిని దెలియ గింపవలసినది లేదు.

* క. జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబు లగుచు । దిరుగుచునుండన్
దనువులు నిలకడ గావట
వనములలో నున్ననైన । వనరుహనాభా.

శా. నిన్నున్ జూచుచు నిన్నె గొల్చుచునుని। న్నే ధ్యానమున్ జేయుచున్
యెన్నం డేమఱనట్టి మానివరులే । యీసర్వమున్ మిధ్యయం
చెన్నన్ జాలక మోసపోయెదరు గా।దే యట్టి దీయాతి మి
మ్మెన్నన్ జాలక మోస పోవుటది లె। క్కే బోధివ ధర్మంబగున్.

[శీఘ్రముగా మాలిని ప్రవేశించును.]

మాలి—అమ్మా! నీ తలతిక్క తీరినదా? శ్రీకృష్ణుండు పరంధాముం డుగాని కేవల మనుష్యుండుగాడని నేజెప్పలేదా? అట్లుజెప్పి నప్పుడు నన్ను నిందించితివిగాదా? ఈనాటికైన నిందున్న రహస్య మెఱింగితివా?

14 వ అనుబంధము.

చంద్ర—దేవా! నన్నురక్షించి నీదివ్యదర్శనం బొసంగుము.

కృష్ణ—(చంద్రముఖిని లేవదీసి) రాధా! ఏమందువు?

రాధ—స్వామీ! నీభక్తురాలికోర్కె నాదరింపుమందును.

*నార—దేవా! ఆమె గర్వపరిహారమైనది గావున క్షమించుట కర్తవ్యము.

3 పె-ము — నారాయణా! నీమహామహిమ కడ్డేమున్నది. ఆమెను రక్షింపుము.

కృష్ణు — చంద్రముఖీ! నీభర్తను నీవు గుర్తింపఁగలవా?

చంద్ర — దేవా! మఱల నన్నుఁ బరీక్షింపదలంచితిరా? నీయనుగ్రహము లేనినాఁడు నాపతిని నేను గుర్తింపఁగలనా? దేవా! నా పతిని నాకు నీవే జూపింపవలయును.

కృష్ణు — చంద్రముఖీ! ఇటురమ్ము.

చంద్ర — (సమీపించి) దేవా! ఏమిసెలవు?

కృష్ణు — (కన్నులుదుడిచి) వీరిలో నీపతి యెవ్వఁడో యిప్పుడు గుర్తింపుము. (ఎనమండుగురు మాయావేదపురులుఅంతర్ధానమగుదురు)

చంద్ర — కృష్ణా! కృష్ణా!

తే. గీ. నీమహామహిమంబు వర్ణింపఁదరమె
నన్నుబోలిన యజ్ఞాని । కెన్నడైన
నూహమాత్రన సర్వంబు । నుద్భవించి
నంతలోబోవు నిన్నెన్న । నెంతిదాన.

శ్లో॥ లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం
పూర్ణేందువక్త్రం పురుహూతమిత్రం
కారుణ్యపాత్రం కమనీయగాత్రం
వన్దేపవిత్రం వసుదేవపుత్రమ్॥

కృష్ణు — చంద్రముఖీ! ఇకనైనను జ్ఞానముకలిగి మసలుకొమ్ము; ఐహిక మెప్పటికిని శాశ్వతముగాదని యెఱుఁగుము.

తే. గీ. ఘనపతివ్రతలకు నైన । మునులకైన
మరణ మనుమాట తప్పదో । మగువమిన్న
మరణమున్నట్టి యెల్లరున్ । స్థిరముగాను.
బరుని ప్రార్థించి ముక్తిని । బడయవలయు.

నీకు బాలముచెప్పుటకే యిట్టి పన్నుఁగడ బన్నితిని. అంతయు సరి యయ్యె. నీభర్త నీయింటియందే వ్రేపల్లెలో నున్నాడు. ఆతఁడును నీకొఱకై వచ్చుచున్నాఁడు. బాటమధ్య నీవృత్తాంత మంతయువినును. ఇంకొక్క ఘడియలో నీభర్త వచ్చి నిన్ను గలిసికొనును. మావచ్చినపని యైనది గావున మేమింక వెడలెదము.

చంద్రి—దేవా ! అనుగ్రహింపఁ బడితిని.

15 వ అనుబంధము.

కృష్ణు—నారదా ! నీమనోభీష్టము దీరినదా ?

నార—దేవా ! నీయనుగ్రహ మున్నవారికి లోపము లెట్లొదవును?

రాధ—దేవా ! ఈమహాసాధ్వి మీదివ్యరూపదర్శనోత్సాహినియై యున్నది. ఆమె యభీష్టశిద్ధి నొనగూర్పరా ?

కృష్ణు—తప్ప కొసంగెదను.

(రాధాకృష్ణులు నిష్క్రమింతురు.)

[వేదవ్రుఁడు ప్రవేశించును.]

వేద—ప్రియా ! నీజన్మ తరించినది. నీవలన నాజన్మ తరించినది. ధన్యుడనైతిని. శ్రీకృష్ణభగవానుఁడు నన్ననుగ్రహించి నాకమితపాండిత్య మొసంగెను.

[తెరలో పెద్ద కలకలము. తెర యెత్తబడును. క్షీరసాగరమున శేషపాన్పుపై శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీసమేతుఁడై యుండును. అందఱును స్తుతింతురు. తెఱ వ్రాలును.]

పెద్ద—అమ్మా ! నీమహామహిమవలన మాజన్మలు తరించినవి. మాయదృష్టమునకు మేరలేదు. మాకు సెలవొసంగుము.

చంద్రి—మంచిది. పోయిరండు.

(పెద్దమనుజులు నిష్క్రమింతురు.)

చంద్రి—కృష్ణా! కృష్ణా!

*మ. సరసాపాంగతరంగరంగితవిలా । స ప్రౌఢిచే నగ్గమై
మరుబారిఁ వలగుబ్బలుబ్బి పులకిం । పం గ్రొమ్ముకుల్ పేడఁ ద
త్తరపున్మేల్ సివమెత్తి వృత్తిలిన కాం । తాపాళి లాలించు బి
త్తరపున్నవ్వుమొగంబునుం గలుగు భూ । గ్రస్వామి గీర్తించెదన్.

*ఉ. నామదినామఅంతు భవ । నత్రియ మోహనరూపధేయు రా
ధామది రేఖణాపరిణ । తస్తనభారవిధేయు భోజక
న్యామహనీయ విభ్రమ ర । సాస్పదవిగ్రహ సౌకుమార్య లీ
లామధురాధరస్మితక । లాపుఁ గళాగురువర్యు నెప్పుడున్.

(చేతులు జోడించి)

శ్లో॥ సాయజ్ఞ్యాలెవనాన్తె కుసుమిత సమయే సైకతే చన్ద్రికాయాం
త్రైలోక్యాకరణాఙ్గాంసర నరగణికా మోహనాపాఙ్గ మూర్తిమ్
సేవ్యం శృఙ్గారభావైర్నవరసభసి తైద్గోపకన్యా సహస్రై
ర్వన్దేఽహం రాసకేళీరతమతి సుభంగం వశ్య గోపాలకృష్ణం॥

తెర వ్రాలును.

ఇది పంచమాంకము.

సర్వము సమాప్తము.



# అనుబంధములు.

## 1. వ. అనుబంధము.

నార— దేవగాంధారిరాగము - ఏకతాళము.

ప॥ నారాయణ - నారాయణ - నారాయణా

అ॥ ప॥ దీనావన - దిక్కునీవె - గావరావె॥ నారా॥

చ॥ 1. పతితపావన - భక్తపోషణ

పాపహారణ - గావుమసత్కరుణ॥ నారా॥

2. సతతంబును నీ - చరణకమలములే

మతినమ్మిన నీభక్తుల - మనుపుము పెనుదయ॥ నారా॥

---

## 2. వ. అనుబంధము.

నార — శంకరాభరణరాగము — ఆదితాళము.

ప॥ సర్వలోకేశా ! - ఈశా ! సుప్రకాశా !

అ॥ సర్వము నీకే - యెఱుకా ! సర్వేశా !॥ సర్వ॥

చ॥ 1. పాపభూయిష్టము బరగు లోకంబుల

కాపాడవే యోకరుణాసాగర॥ సర్వ॥

2. తాపసమందారా - తగనిగర్వముతో

నలరు చంద్రముఖి - గర్వ ముడుపరాదే॥ సర్వ॥

3. భక్తజనమందారా - పాపహారా

నీ నామం బెద దలంచిన - నిఖిలపాపము లడగు॥ సర్వ॥

---

## 3. వ. అనుబంధము.

రాధ— హంసధ్వనిరాగము—ఆదితాళము.

ప॥ ఎన్నఁడు లభించునో - యీజన్మ తరింపఁగ॥ నాకు॥

అ॥ ప॥ కంజదళేక్షుని పద - కమలసేవ నా॥ కెన్న॥

చ॥ 1. లీలామాత్రవినోదుండై - లీలల బచరించెడి యా
కాళీయమర్దనుని పద - కమలసేవ నా॥ కెన్న॥

2. సంసారసాగరమును - దరియింపంగ జేసెడి యా
కంససూదనుని పద - కమలసేవ నా॥ కెన్న॥

3. నిత్యానిత్య వివేకిమై - నిర్గుణబ్రహ్మమగు నా
సత్యస్వరూపు పద - చరణసేవ నా॥ కెన్న॥

---

4. వ. అనుబంధము.

రాధ — ఫీల్వారాగము — ఆదితాళము.

ప॥ అంతపాటి భాగ్యమా! యీనిర్భాగ్యురాలి॥ కంత॥

అ॥ ప॥ చెంత జేరి - శ్రీహరుని సేవించి తరించు॥ నంత॥

చ॥ పతితపావను । పాపవిమోచను పదములంటి
సతతంబును - గొల్చుచు - తరించు॥ నంత॥

సాకీ—మునిజనమందారుఁ
ఘనగుణగణధీరుఁ
మనుజులోకమందారుఁ

మిత్ర—కనుముదమున సేవించు గనుదమ్ముల గాంచుచు
మొకమొక పూజించుచు. నీకుగొల్చి తరించు॥ నంత॥

---

5. వ. అనుబంధము.

రాధ— పున్నాగరాగము-ఏకతాళము.

ప॥ ఎఱుగనైతినే - నేనెన్నఁడెఱుగనైతినే॥

అ॥ ప॥ చెలియా! నాగతియిట్లగునని కలనైన॥ నేనెఱు॥

చ॥ 1. తనపాదములే నా - మనముననిల్పి
యనయము సేవించు నా - కయ్యో యిట్లగునని॥ యెఱు॥
2. మానినీమన్మథు సేవ - మనమునవిడువక
బూనిచేయుచున్న నా - పుణ్య మిట్లగునని॥ యెఱు॥
3. మన్నించెడి శ్రీకృష్ణుని - నెన్నుచు మోదంబున
నిన్నాళులు సేవించి సేవ - కిట్టిఫలంబని యెఱు॥

---

6. వ. అనుబంధము.

వేద — జంఝూటిరాగము — ఏకతాళము.

ప॥ సెప్పవేమె? నాకుసెప్పవేమి?
అ॥ ప॥ ఒప్పులాడివచ్చినట్టి - గొప్పసిక్కదేంగొ నాకు॥ సె॥
చ॥ 1. సెప్పినంత - ఆర్సిబట్టి
ముప్పుతిప్పలాను - బెట్టివత్తు॥ సెప్ప॥
2. యెట్టిదాన - యేమపెందుకు
బుట్టసితక - మొడిచివత్తు॥ సెప్ప॥
3. సెప్పినంత ఆళ్ళబట్టి - సెప్పులతోడసావగొట్టి
తప్పకుండ కాళ్ళకాడ - నిప్పుడె పడవేతువేగ॥ సెప్ప॥

---

7. వ. అనుబంధము.

రుక్మి — ధన్యాసిరాగము — ఏకతాళము.

ప॥ నీమహామహిమెఱుగ నాకువశమా!
అ॥ ప॥ నిఖిలలోకేశ - సర్వేశ నిర్జితదైత్యేశ॥ నీమ॥
సాకీ — సర్వలోక సృష్టిస్థితిలయకారకా
సాధుజనావనపాలకా

సతతభక్త హృన్నివాసకా
సర్వపాప వినాశకా
మిశ్రిత—సాధుహృదయలోలా - రాధికాహృదయలోలా
నీచెంతనె బడియున్నను- నీసేవనే జేయుచున్న॥ నీమ॥

---

8. వ. అనుబంధము.

చంద్రి— నీలాంబరిరాగము — ఏకతాళము.

ప॥ ఎటుబోవునో!

అ॥ ప॥ ఈపాపము నా - కేటుపోవునో॥ ఎట॥

చ॥ 1. ఎఱుగక పరుల - బరుషములాడి
యురకగడియించిన - యీ పాపము నా॥ కెటు॥

2. ఘనపతివ్రతనని - మనమునదలంచుచు
ఘనులనిందించిన - కల్మషమిపుడయ్యె నా॥ కెటు॥

3. నాచరితమువిని - నవ్వరెలోకులు
ఛీఛీ యీబ్రతుకేల - కాల్పనా కూడనిపాపం॥ బెటు॥

---

చంద్రి— 9 వ. అనుబంధము.

ఫరజురాగము—ఏకతాళము.

ప॥ తగునా! నాధా! త్వాదృశులిటులబలుక॥ తగు॥

అ॥ ప॥ సత్సతీమణియని - నుతికెక్కిననన్నిటులన॥ తగు॥

చ॥ 1. మగఁడవైన నీమీదనె - మనముంచుకపై
జగమెఱుగనట్టి - సాధ్వియనుచుఁ దలఁపక॥ తగు॥

2. పలుమాఁగులు నిటుల - బల్కి పాపంబును నా
దలపైనిఁజూచుట - ధర్మమె తమవారికి॥ తగు॥

3. గోపాలుఁడు పిఱికివాఁడు - మాలిని యబలామణి
వీరలకేఁ బయలు దేఱ - వెఱచినసత్సతిని నిటుల॥ తగు॥

---

10. వ. అనుబంధము.

3 మా-వే— తోడిరాగము—ఏకతాళము.

ప॥ రామె రామె సిన్నదాన - రామె రామె కుఱ్ఱదాన॥ రా॥

అ॥ ప॥ రామె రామె సిన్నదాన - రామె రామె యింటిదానా॥ రా॥

చ॥ 1. ఎందేవ్వూసాడవు - యిందెవడేనీమగఁడు
సందుంబెదాబెయ్యి - జాలియున్నావు॥ రామె॥

2. పుత్తిగట్టినమొగుడియెంట - ఒత్తేనేమంసిదే
సత్తువపూని తనన్నా - సచ్చినట్టులౌత్తావా॥ రామె॥

3. పైవోళ్ళునిన్నిట్టు - పడలాగుసుంటేని
నేవ్వూరుకుంటూనా - నోటగడ్డిపెట్టుకొని రామె॥

---

11. వ. అనుబంధము.

2 మా-వే—మెఱుకులకాంభోజిరాగము—ఏకతాళము.

ప॥ ఏంటేయీవేసము ఇది - యేంటే॥

అ॥ ప॥ యీ-యీ-పలుకులేంటే-యీ - యీకులుకులేంటే
యీ-యీతళుకులేంటే యీ-యీ - యల్లరేంటే॥ ఏంటే॥

చ॥ 1. పతిరతనన్నావు - గతినీవనియన్నావు
సతతమ్ము పైమగల - సరసకుజేరావు॥ యేంటే॥

2. మగఁడుమగడంచును - వగలెన్నొజూపుచు
మగనికంట్లె కార - మట్టైజల్లేశావు॥ యేంటే॥

3. పైయేసమేశావు - పాపానికొడిగట్టావు
పైయెదవలందరిని - భమదీరతూశావు! యేంజే!

12. క. అనుబంధము.

7 మాం-వే — సింధుకన్నడరాగము — ఆదితాళము.

ప॥ ఎగిసెగిసితన్నగా - సిగబట్టికోయనా
అ॥ ప॥ వగలాడిచెప్పవేమె? - మగండెవ్వడిందులోన॥ ఎగి॥
చ॥ 1. మెడబట్టిగెంటనా - పిడిగుద్దుగుద్దియనా
గడుసబ్బకూతురా - కాల్చివాతబెట్టనా॥ ఎగి॥
2. గుండమిండిచేయనా - కొరతవేసిచంపనా
బండముండా నిన్నుబట్టి - పైచర్మమొలవనా? ఎగి॥

13. వ. అనుబంధము.

చందు — ఆనందభైరవి రాగము — ఏకతాళము.

ప॥ అనఘపాలన - భువనమోహన! ఆదరింపుమా!॥ అన॥
అ॥ ప॥ మనమునందున - సదృశకరణ బూనియుంచుమా; అన॥
చ॥ 1. నీలదేహా - కలుషదనుజదాహా
కమలాలయ - హృన్నివాస - కనకచేల! అన॥
2. దనుజకంఠలుంఠనా - తపసిలోకవాసా
ఘనకరుణను - గాపాడుము - నీదాసిని॥ అనఘ॥
3. సతతము నీపద - పద్మంబులభజియింతును
గతియుంటిని - కాపాడుము - కరుణాసాగర; అన॥

## 14. వ. అనుబంధము.

మాళి— కేదారగౌళరాగము—ఆదితాళము.

ప॥ తెలసెనా! నీకు, తెలసెనా!

అ॥ ప॥ శ్రీరమాధవునిచరితము నేటికైన॥ తె॥

చ॥ 1. కలికి యాతనిపద - కమలమందున
తలవాల్చి మ్రొక్కుము - గలుగుశుభములు॥ తెల॥

2. పరునిగొలువని - పాపమతులకు
దురితములునంటి - దుఃఖవార్ధిముంచునని॥ తెల॥

3. ధర బతిపత్రనడి - గిరువమంటనుకలుగు
నురుతరంబగుకష్ట - మురకవిడవనినేడు॥ తెల॥

---

## 15. వ. అనుబంధము.

చంద్ర—ప॥ సంతసించితినో - దేవా! నే॥ సం॥

అ॥ ప॥ నామందబుద్ధిపోగొట్టి - బోధించితివని॥ సం॥

చ॥ 1. నీనామంబెద - దలచిన
నిన్నే మదినుతి - యించిన
దురితము ల - డంగును
స్థిరయశమది - లభియించును॥ సం॥

2. నిన్నెప్పుడు - కీర్తించెద
నాగర్వంబెద - బోనాడెద
సాదరమతి న - న్గావుము
సాధుహృదయలోలా - సన్మునిసన్నుతలోల॥ సం॥

